# ఆంధ్రప్రదేశ్

సంపుటి 11 ] ఫిబ్రవరి 1967 [ సంచిక : 4
మాఘ-ఫాల్గుణం 1888 శ.క.సం

ప్రధాన సంపాదకులు
బి. ఆర్. కె. శాస్త్రి,
ఎం.ఎ., ఐ.ఎ.ఎస్.

సంపాదకులు
ఎన్.వి. గోపాలశాస్త్రి

## ఈ సంచికలో



ముఖ చిత్రం : సుమసౌందర్యం
ఫోటో ఎస్ ఆర్.కె రావు

రెండవ చిత్రం ఆదిలాబాదు జిల్లాలోని
మాథురీ గిరిజన స్త్రీ

మూడవ చిత్రం హైద్రాబాదు మక్కా మసీదు
వద్ద రమ్జాన్ ప్రార్థనలు
ఫోటోలు సయీదుద్దీన్

నాలుగవ చిత్రం మంచుతెరలు
ఫోటో : నందగోపాల్

* ఈ సంచికలోని రచయితల అభిప్రాయాలు ప్రభుత్వానికి సంబంధించినవి కావు.

58-1







# తేజోవంతమైన భవిష్యత్తు కోసం





ఆంధ్రప్రదేశ్ అవతరించి, ఒక దశాబ్దం పూర్తి అయింది ఈ శుభావసరాన నాలుగు కోట్ల తెలుగు ప్రజలం ఒక్కటై హర్షానందాలను వర్షిస్తున్నాం 1956 నవంబరు ఒకటి ఆంధ్రుల చరిత్రలో అత్యంత ఉజ్వలమైన సంఘటన అకుంఠిత మైన విశ్వాసంతో, అచంచలమైన ప్రయత్నంతో అపూర్వమైన సంచలనంతో, అవధులు దాటిన సంరంభంతో గడిచిన ఒక దశాబ్దిలో ఆంధ్రప్రదేశ్ ఆశాపూరితమైన భవిష్యత్తుకు అనేకమైన బాటలు వేసింది ఆంధ్రావళిలో నూతనోత్సాహాల దీపకళికల్ని వెలిగించి మన ఆర్థిక ప్రణాళికలు మనలో ఆశావహమైన, అతివిశాలమైన ఆలోచనల్ని రేకెత్తించాయి

ఒక వంక వ్యావసాయిక ఉత్పత్తుల అభివృద్ధికి, మరొక వంక పారిశ్రామిక రంగపు ప్రాతిపదిక వ్యవస్థకు మన ప్రణాళిక లలో ప్రాధాన్యం లభించింది ఆంధ్రప్రదేశ్ అభ్యున్నతి దృష్ట్యానే గాక మన జాతీయ అవసరాల కారణంగాను మనం వ్యవసాయానికి విశేషమైన ప్రాముఖ్యం ఇవ్వక తప్పదు

సంఖ్యలు చాటుతున్న సత్యాలను గమనించితే మొదటి ప్రణాళికలో 101 వ శాతం, రెండవ ప్రణాళికలో 105 వ శాతం, మూడవ ప్రణాళికలో 115 వ శాతం పెట్టుబడుల రూపంలో ఆంధ్రప్రదేశ్ సాధించిన అభివృద్ధి మనందరికీ గర్వ హేతువుగా ప్రస్ఫుటమవుతుంది.

వ్యావసాయిక, పారిశ్రామిక రంగాల అభ్యుదయానికి ఆధార భూతమైన విద్యుచ్ఛక్తి విస్తృతికొరకు గడచిన దశాబ్దంలో, అంటే రెండవ, మూడవ పంచవర్ష ప్రణాళికల పరిధిలో 126.01 కోట్ల రూపాయలను వెచ్చించడం జరిగింది ఇదేకాలంలో వ్యవసాయ నీటిపారుదల రంగాల అభివృద్ధి కొరకు వెచ్చించిన ధనం 266.11 కోట్ల రూపాయలు

ఉరవళ్లతో, పరవళ్లతో ఉధృతరూపంలో ఆంధ్ర ప్రదేశ్‌లో ఆవిర్భవిస్తున్న ఒక నవ్యమైన చైతన్య స్వరూపానికి, సజీవ చిహ్నంగా 622 కోట్ల రూపాయల పెట్టుబడితో మన రాష్ట్రం నాలు గవ పంచవర్ష ప్రణాళికను రూపొందించుకొన్నది ఇందులో ఇంతకు ముందువలెనే వ్యవసాయానికి, నీటిపారుదలకు ప్రత్యేక మైన ప్రాధాన్యం లభ్యమయింది వేయిరేకులతో వికసిస్తున్న 'రేపు' నిత్యనూతనమైన పరిమళాలను పంచిపెడుతుంది అందు కొరకు మనం ఈ రోజు జరిపిన అంకురార్పణ సుస్పష్టమూ, సుఫలసూచకమూ అయినదనడంలో ఎంతమాత్రం సందేహంలేదు.

సడలని సత్తువతో, విడువని పట్టుదలతో మనం రెండవ దశాబ్దపు మంగళకరమైన రంగవల్లికల మధ్య అడుగు పెడు తున్నాం. మాతృభూమి సేవకు మన మనసుల్ని పునరంకితం చేస్తున్నాం

నిన్నటి చైతన్యవంతమైన దశాబ్దం రేపటి తేజోవంతమైన భవిష్యత్తుకు భ్రమర గీతాలను పాడుతున్నది. వైతాళిక గీతా లను వినిపిస్తున్నది.

# ప్రగతిలోకి జైత్ర యాత్ర



1956లో క్రొత్త రాష్ట్రాన్ని మనం ఏర్పాటు చేసుకుంటున్నప్పుడు రాష్ట్ర భవిష్యత్తుపై కొండంత ఆశతోపాటు విపరీతమైన భయాందోళనలుకూడా వుండేవి. అయితే రాష్ట్రాన్ని ఒక్కటిగా సంఘటిత పరిచి దాని అభ్యుదయానికై మనం చేపట్టిన బృహన్నిర్మాణ కృషి అంతా సజావుగా సాగిపోయింది. ఈనాడు మనం ప్రగతి పథంలో పయనిస్తున్నాం. ఆదిలో కొన్ని బాలారిష్టాలను ఎదుర్కోవలసి వచ్చినప్పటికీ యితర రాష్ట్రాలతో పోల్చి చూసినప్పుడు మొత్తంమీద ఆంధ్రప్రదేశ్ శైశవ దశను సంతృప్తికరంగా అధిగమించింది. అక్కడక్కడ చెదురుమదురుగా కొన్ని కష్టాలు—ఏ వరద వెల్లువో వచ్చి, ఏ ఆహార కొరతో ఏర్పడి యిబ్బంది కలిగి వుండవచ్చు. అయితే ఆ కష్టాల నన్నిటినీ ధైర్యంగా అకుంఠిత దీక్షతో, అపార విశ్వాసంతో ఎదుర్కొని అధిగమించగలిగాం. గతంకన్న సురుచిర వర్తమానాన్ని నిర్మించుకుంటున్నాం. మనం వర్తమానంకన్న సుందరమైన భవిష్యత్తుకు బాటలు వేసుకుంటున్నాం. అధిక జనావళికి సర్వోత్కృష్టమైన మంచినంతా పంచి పెట్టాలని ఆ కృషిలో నిమగ్నులమై వున్నాం.

## సమగ్ర స్వరూపం

1956 నవంబరు ఒకటిన రాష్ట్రం కొత్తగా ఆవిర్భవించి నప్పటి నుండి నేటివరకు అది సాధించిన సర్వతోముఖవికాసం నిజానికి ఏమంత నిరుత్సాహ పూరితంగా లేదు. అయితే మరికొంత సుందరంగానూ, ఆశావహంగానూ వుండాల్సిన మాట నిజమే. 1956 నవంబరు 1 న రాష్ట్రావతరణ జరిగినప్పటికీ అసలైన అభివృద్ధి కృషిఅంతా మూడేళ్ల తర్వాతనే మంచి ఉత్సాహంతో చేపట్టడం జరిగింది. మొదట్లో రాష్ట్రంలో పారిశ్రామిక అభివృద్ధి మందకొడిగానే వుంది. గోదావరి, కృష్ణ, తుంగభద్రవంటి పెద్దనదులపై వంతెనల్ని రాష్ట్రావతరణానంతరమే నిర్మించినప్పటికీ రాష్ట్ర విస్తీర్ణం దృష్ట్యా రాకపోకలు, రవాణా సౌకర్యాలలో చెప్పకోదగినంత అభివృద్ధి జరగలేదు. కోస్తా ప్రాంతంలో ఆహారోత్పత్తి చాలా మెరుగ్గా వుంది. అయితే రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలలో అంతబాగాలేదు. సగటున మన రాష్ట్రంలో ఉత్పత్తులను పరిశీలిస్తే అవి గొప్పగా లేకపోయినా సంతృప్తి కరంగా మాత్రం వున్నాయి. భారత దేశంలోని యితర రాష్ట్రాలలోని జనాభా పెరుగుదలను పరిశీలించినప్పుడు మన రాష్ట్రంలో జనాభా పెరుగుదల అంత ఎక్కువగా లేదు. ఆంధ్రప్రదేశ్‌లో పెద్ద ఎత్తున సాంఘిక భద్రతా చర్యలు, విద్యావిషయక సంస్కరణలు ఆమలు పరచబడ్డాయి. వాటిని క్లుప్తంగా వివరిస్తాను. బాలికలకు మెట్రిక్యులేషన్ వరకు, బాలురకు మాధ్యమిక దశవరకు ఉచిత విద్యా సౌకర్యం కల్పించారు. యోగ్యులైన బీద విద్యార్థులకు అనేక విద్యా రాయితీలను అందిస్తున్నారు. వెనుకబడ్డ కులాల వారికి వివిధ రాయితీ సౌకర్యాల్ని కల్పిస్తున్నారు. షెడ్యూలు జాతుల వారికి, హరిజనులకు ఉచిత విద్యా సౌకర్యం అందజేస్తున్నారు. వార్ధక్యపు పింఛనులు యిస్తున్నారు. ముదుసలులకు, దిక్కులేని వారి కొరకు ఆశ్రయాలను నెలకొల్పారు. అనేక మంది హరిజన విద్యార్థులకు. బీద విద్యార్థులకు ఉచిత బోర్డింగు సౌకర్యాల్ని కల్పిస్తున్నారు.

## వ్యవసాయంలో అనవరత కృషి

ఒక వైపు వ్యవసాయోత్పత్తుల్ని అధికం చేయడం. మరో వైపు పరిశ్రమకు కావలసిన మౌలిక సౌకర్యాలను సమీకరించుకోవడం అనేవి మన రాష్ట్ర భవిష్యత్తుకు మనం వేసిన ప్రణాళికల అంచెలు. ఈ దృష్టితోనే మనం ప్రణాళికల్ని చేపట్టుతున్నాం. వ్యవసాయంలో అనవరత కృషి అవసరం. రాష్ట్రంలో అధిక జనావళికి సుదూర భవిష్యత్తులోనే సుందరమూ, సురుచిరమూ, ఐశ్వర్యవిలసితమూ అయిన జీవితాన్ని ప్రసాదించడానికి యిదొక మార్గం. అంతేకాదు జాతీయ ప్రయోజనం దృష్ట్యా ప్రాధాన్యమైన

అంశంకూడా దీనికితోడు రాష్ట్ర భవిష్యదభ్యుదయానికి, ప్రగతి సౌధానికి పారిశ్రామికీకరణద్వారా, బహుముఖ ఆర్థిక స్వరూప విస్తరణ ద్వారా శంకు స్థాపన జరగాలి.

స్వాభావికమైన గొప్ప ఓడరేవు కలిగిన విశాఖ; అపారమైన బొగ్గు, తదితర ఖనిజ సంపదలు నిక్షిప్తమైవున్న కొత్తగూడెం, రామగుండం సముదాయం; దేశానికి హృదయమై విలసిల్లే హైదరాబాదు ప్రాంతం; ఇరవై లక్షల ఎకరాలకు సాగు నీటిని అందించే బ్రహ్మాండమైన ఆనకట్ట నాగార్జునసాగర్ క్రింద గల ఆయకట్టు–సుదూర భవిష్యత్తులో రాష్ట్ర అభ్యున్నతికి యివి కేంద్రాలన్న విషయం చూచినవారి కెవరికైనా అర్థమౌతుంది

## నవ చైతన్యం

పగిలి, తునాతునకలై, చెల్లా చెదరైన మన వ్యవసాయ ఆర్థిక వ్యవస్థను సమీకరించి ఒక్కటిగా పేర్చికూర్చి, దానిని ఒక ప్రయోజనకరమైన పద్ధతిలో అభివృద్ధి పరచవలసిన బృహత్కార్యం స్వాతంత్ర్యానంతరం మన భుజస్కంధాల మీద పడింది రెండు శతాబ్దాలుగా అలక్షింపబడుతూ వచ్చిన దానిని ఒక్కరోజులో మనం పరిష్కరించలేం అసలు యితర రంగాలతో పోల్చినప్పుడు పటిష్ఠమైన వ్యవసాయ ఆర్థిక ప్రగతి అనేదే చాలా మందగమని రెండు శతాబ్దాలుగా కుంటుపడిన వ్యవసాయాభివృద్ధి మెలమెల్లగా కోలుకోవాలి ఈ కోలుకోవడానికి యేళ్ళ తరబడి పట్టవచ్చు. గడచిన కాలంనాటి మాంద్యంలోంచి చైతన్యంలోకి రావాలంటే మరికొంత ఆలస్యం కావచ్చు. ఇన్ని అవరోధాలు ఉన్నప్పటికీ మన జాతీయ ప్రభుత్వం ఈ కృషికి ఆయత్తమైంది. వ్యవసాయోత్పత్తులను పెంచడానికి బ్రహ్మాండమైన నదీలోయ ప్రాజెక్టుల్ని నిర్మించింది. సాగు నీటివనరులను అందించే అనేక ఆనకట్టలను నిర్మించింది ఈ పందొమ్మిదేళ్ళ వ్యవధిలోనూ మనం సాధించిన ఫలితాలు నిజంగా గొప్పవి. ప్రత్యేకించి చెప్పుకోదగ్గవి. ముఖ్యంగా గడచిన రెండు శతాబ్దాల చరిత్రనూ అవలోకించినప్పుడు ఈ కొద్దిపాటి కాలంలోనూ మనం సాధించిన అభివృద్ధి అసాధారణమైనది తొలిమూడు పంచవర్ష ప్రణాళికల్లోనూ వ్యవసాయ రంగం క్రింద రూ. 3,200 కోట్లకు పైగా వెచ్చించారు. సాగుభూమి 9 కోట్ల ఎకరాలకు పెరిగింది 1950–51 లో ఆహార ధాన్యాలు, పప్పు ధాన్యాలు, కాయధాన్యాలు మొత్తం 522 లక్షల టన్నులు ఉత్పత్తి కాగా 1964–65 లో యిది 890 లక్షలకు పెరిగింది.

ఆహారోత్పత్తిలో ఆంధ్రప్రదేశ్, భారతదేశంలోని యితర రాష్ట్రాలతో పోల్చినప్పుడు ప్రధాన స్థానం వహిస్తుంది. ప్రకృతి మాత చల్లనిచూపే యిందుకు కారణం. మన వ్యవసాయ దారులు కష్టించిపనిచేసే స్వభావంగలవారు సాహసికులు. ప్రయోజనంలేని పాత పద్ధతుల్ని, సాంప్రదాయాలను విడిచిపెట్టడానికి ఎప్పుడూ వెనుకంజ వేయనివారు. పైగా ఆధునిక పరికరాలను, ఎరువులు, క్రిమిసంహారకాలు తదితర ఆధునిక పద్ధతులను అమలుపరచడంలో సత్వరమే ముందుకువచ్చే ప్రకృతిగలవారు.

వారు చేస్తున్న ఈ బృహత్కార్యక్రమానికి ప్రభుత్వం కూడా ఎంతగానో తోడ్పడుతోంది. ఆహారధాన్యాల విషయంలో మనదేశాన్ని స్వయం సమృద్ధము, స్వయం పోషకము చేయడానికి జరుగుతున్న మహా క్రతువులో అతిహుందాగా, ప్రయోజన కరంగా ఆంధ్రప్రదేశ్ పాల్గొంటున్నందుకు నిజంగా మనం గర్వపడాలి మన రాష్ట్రం ఆహార విషయాలలో స్వయంసమృద్ధమైనప్పటికి గత పదిహేనేళ్ళుగా యింకా అధిక ఆహారోత్పత్తికి నిరంతరంగా కృషి జరుపుతూనే వున్నది. ఈ కృషిని భవిష్యత్తులో కూడా మనం కొనసాగిస్తాం. కొరత రాష్ట్రాలకు అన్నం పెట్టడానికి వీలుగా రాష్ట్రంలో లభ్యమయ్యే సౌకర్యాలన్నిటిని వీలయినంతవరకు వినియోగించుకుని గరిష్ఠ ఉత్పత్తిస్థాయికి చేరుకోవాలన్నది మన లక్ష్యం.

## భారీ, చిన్నతరహా ప్రాజెక్టులు

మన ఆహారానికి విదేశాలపై ఆధారపడే స్థితికి సాధ్యమైనంత త్వరగా స్వస్తి చెప్పడానికి వీలుగా అధికాహారోత్పత్తుల్ని మన వ్యవసాయదారులు సాధించేందుకు భారీ, చిన్నతరహా ప్రాజెక్టులను వీలయినంత త్వరలో పూర్తి చేయడానికి మన ప్రభుత్వం దృఢ నిశ్చయమైంది.

రాష్ట్ర ఆర్థిక వ్యవస్థలో వ్యవసాయం వహించే ప్రాధాన్యతను గుర్తించి ఆంధ్రప్రదేశ్‌లో గతమూడు ప్రణాళికల్లోనూ వ్యవసాయ కార్యక్రమాలపై వ్యయాన్ని క్రమ క్రమంగా హెచ్చించడం జరిగింది. తొలి ప్రణాళిక వ్యయం రూ 96 78 కోట్లలోనూ వ్యవసాయ కార్యక్రమాలకు 12.7 శాతం—అంటే రూ. 12.30 కోట్లు—వెచ్చింప బడ్డాయి. ద్వితీయ ప్రణాళిక మొత్తం వ్యయం రూ. 188 60 కోట్లలోనూ వ్యవసాయ కార్యక్రమాలకు 19.7 శాతం—అంటే రూ. 37.14 కోట్లు ఖర్చయింది. తృతీయ ప్రణాళికలో కూడా వ్యవసాయ కార్యక్రమాలకు అధికంగానే వెచ్చించడం జరిగింది. సవరించబడిన తృతీయ ప్రణాళిక కేటాయింపు రూ 312 66 కోట్లలో సుమారు రూ 79 84 కోట్లు వ్యవసాయ కార్యక్రమాలకు ఖర్చు పెట్టారు. మొత్తం ప్రణాళికా పథకాలన్నిటి క్రిందఅయిన ఖర్చులో వ్యవసాయ కార్యక్రమాల క్రింద అయిన ఖర్చు 25.5 శాతం వుంది. పైన పేర్కొన్న వ్యయంలో భారీ, మధ్యతరహా ప్రాజెక్టుల క్రింద అయిన వ్యయాన్ని చేర్చలేదు.

ఆహారోత్పత్తులను పెంచాలంటే మేలు జాతి విత్తనాలను వాడాలి. మేలు జాతి విత్తనాలని వాడడంద్వారా పంట దిగుబడిని సులభంగా 10 నుంచి 20 శాతం అధికం చెయ్యవచ్చు. కొన్ని సందర్భాలలో యింకా ఎక్కువ శాతం కూడా వుంటుంది. ప్రణాళికలను అమలు పరచడం ప్రారంభించినప్పటినుండి రాష్ట్ర వ్యవసాయ శాఖ మేలు జాతి విత్తనాలను పంపిణీ చేసింది. వాటిని ఉపయోగించ వలసిన అవసరాన్ని గూర్చి, మరింత ఎక్కువగా మేలు రకం విత్తనాలను రూపొందించు కొనే పద్ధతిని గూర్చి వ్యవసాయదారులలో విస్తృత ప్రచారం చేసింది ఈ విషయంలో అభివృద్ధి మండలాలు కూడా బాగా కృషిచేశాయి.

ఎక్కువ పంట పండించినంత మాత్రంచేత వ్యవసాయ సమస్యలు తీరిపోవన్నది అందరికీ తెలిసిన విషయమే. పంట బాగా పండినప్పటికీ తెగుళ్ళవల్లా, క్రిములవల్లా పంట ధ్వంసం కావచ్చు. ఏటా సుమారు 10 నుంచి 20 శాతం పంట తెగుళ్ళ వల్లనూ, క్రిములవల్లనూ ధ్వంసమౌతున్నది. భారతీయ వ్యవసాయ పరిశోధక సంస్థ, కేంద్రధాన్యపరిశోధక సంస్థవంటి అనేక పరిశోధక సంస్థలను ప్రభుత్వం నెలకొల్పింది. ఇవి ఎన్నో పరిశోధనలను జరుపుతున్నాయి. పంట తెగుళ్ళను తట్టుకోగలిగే రకరకాల మేలురకం విత్తనాలను రూపొందించాయి. పంట తెగుళ్ళను క్రిములను నాశనంచేసే వివిధ రకాల రసాయనాలు, క్రిమిసంహారకాలపై పరిశోధనలు జరిపి వాటి సామర్థ్యాలను పరిశీలిస్తున్నాయి.

అభివృద్ధికి సంబంధించిన ముఖ్యమైన రంగాలలో మన రాష్ట్రం చెప్పుకోదగినంత ముందుకు పోయిందని సగర్వంగా చెప్పవచ్చు. సింథటిక్ మందుల కర్మాగారం, భారీ విద్యుత్పరికరాల కర్మాగారం, హెచ్ ఎం టి వంటి భారీ కేంద్రరంగం కర్మాగారాలు పైలట్ ప్లాంటులతో పనిచేయడం ప్రారంభించి రాష్ట్ర పారిశ్రామికీకరణలో ఒక కొత్తశకానికి నాందిపలికాయి. ప్రయివేటు రంగంక్రింద నెలకొల్పబడిన ఇండియన్ డిటోనేటర్స్ కర్మాగారం 1965 లో పని ప్రారంభించింది. రామగుండంలోని థర్మల్ విద్యుత్కేంద్రం, కొత్తగూడెం విద్యుత్కేంద్ర కూటమిలవల్ల ఈ ప్రాంతం ముందు ముందు విద్యుదుత్పత్తిలో ప్రధాన కేంద్రమై అలరారుతుంది. నెల్లూరులో 30 మె. వా. థర్మల్ కేంద్రం ఏర్పాటుతో మనరాష్ట్ర విద్యుదభివృద్ధిలో ఒక అడుగు ముందుకు వేయడం జరిగింది.

సికింద్రాబాదు ప్రధాన కార్యస్థానంగా దక్షిణ-కేంద్ర రైల్వే మండలాన్ని రైల్వేబోర్డు ఏర్పాటుచేసింది. రాజమండ్రివద్ద గోదావరి నదిమీద రైలు బ్రిడ్జితోపాటు రోడ్డువంతెనను నిర్మించడానికి కేంద్ర ప్రభుత్వ మంజూరీ లభించింది. దీని ప్రాముఖ్యతనుగూర్చి ప్రత్యేకంగా చెప్పనక్కర లేదనుకుంటాను. గోదావరిమీద భద్రాచలం వద్ద 1965 లో రోడ్డు వంతెన ఒకటి నిర్మించబడింది. ఈ కొత్త వంతెనవల్ల యింతవరకూ దుర్భేద్యమైన ఏజన్సీ ప్రాంతాలతో నేరుగా రాకపోకల సౌకర్యాలకు అవకాశం ఏర్పడడమే గాకుండా, భద్రాద్రిలోని శ్రీరాముని ఆలయాన్ని సందర్శించవచ్చే అసంఖ్యాక భక్తకోటికి కూడా యిది ఉపయోగకారిగా వుంటుంది.

ఇటీవల ఆంధ్రప్రదేశ్‌లో జరిగిన మూడు ముఖ్య సంఘటనలను గూర్చి ప్రస్తావిస్తాను. ఇప్పటికి నూట పది కోట్ల రూపాయలు వెచ్చించి నిర్మించిన బ్రహ్మాండమైన నాగార్జునసాగర్ ఆనకట్టనుండి జలాలను ఆగస్టు 3న కాలువలలోకి విడుదల చేశారు. దీనివల్ల $5\frac{1}{2}$ లక్షల ఎకరాలకు సాగునీరు లభిస్తుంది. రాష్ట్రంలో అదనంగా మరికొంత ఆహారోత్పత్తి జరుగుతుంది. రెండవది-తుంగభద్ర ఎగువకాలువ ప్రాజెక్టు ప్రారంభంకావడం. దీనిక్రింద గత ఎనిమిది సంవత్సరాలుగా పాతికకోట్ల రూపాయల్ని వెచ్చించాం. సాగునీటికి జలాలనుకూడా విడుదలచేయడం జరిగింది. రాయలసీమలోని వెనుకబడిన ప్రాంతాలలో సుమారు లక్ష యిరవైవేల ఎకరాలకు సేద్యపునీటి సౌకర్యాన్ని కల్పిస్తుంది. ఇక మూడవది-కొత్తగూడెం విద్యుత్కేంద్రం ప్రారంభం కావడం మీకు తెలిసిన విషయమే కదా.

(ముఖ్యమంత్రి వ్యాసాలు, ఇంటర్వ్యూల నుండి)

# అభ్యుదయ పథంలో...

*ప్రజల జీవనం, దృక్పథం, వైఖరులలో మార్పుతేవడానికి ప్రణాళిక ఒక ఉద్యమంవలె తోడ్పడుతున్నది. ఈనాడు ప్రజలు ప్రణాళికా పథకాల ద్వారా ప్రయోజనాలు పొందుతూ జాతి నిర్మాణ కృషిలో చాలా ఉత్సాహంగా పాల్గొంటున్నారు.*

*ఆంధ్రప్రదేశ్ పంచాయతీ రాజ్యావ్యవస్థను ప్రవేశపెట్టి చరిత్ర సృష్టించింది. అడ్‌హాక్ పంచాయతీ సమితులను దేశంలో ప్రప్రథమంగా నెలకొల్పిన రాష్ట్రం ఇది. రాష్ట్రంలో చట్టబద్ధమైన పంచాయతీ సమితులు 1959 నవంబరు మొదటి తేదీన ఏర్పడ్డాయి. తరువాత ఒక నెలకు ఇరవై జిల్లాలలోనూ జిల్లా పరిషత్తులు ఆవిర్భవించాయి. పంచాయతీ సంస్థలలోని ప్రజా ప్రతినిధులు తమ హక్కులను సాధించడంలోనే కాకుండా తమ బాధ్యతలను నిర్వహించడంలో కూడా ఎంతో శ్రద్ధాసక్తులు కనబరుస్తున్నారనే విషయాన్ని పంచాయతీ రాజ్యాపురోగతి వెల్లడిస్తున్నది.*

*ప్రజల మనఃపూర్వకమైన సహకారంద్వారా అభివృద్ధి ప్రణాళికలను శక్తివంతంగా అమలు పరుస్తూ ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ పథంలో పురోగమిస్తున్నది.*

# ఆంధ్రప్రదేశ్‌లో ఉన్నతవిద్య

ఎల్. బుల్లయ్య

భారతదేశంలో విశ్వవిద్యాలయ విద్యను సమీక్షించేటప్పుడు 1857 తో ఆరంభించాల్సి వుంటుంది. ఆ ఏడాదే కలకత్తా, బొంబాయి, మద్రాసులలో ఆధునిక విశ్వ విద్యాలయాలు నెలకొల్ప బడ్డాయి. 30 సంవత్సరాలవరకు దేశంలో యీ మూడే మూడు విశ్వ విద్యాలయాలే ఉండేవి. ప్రథమ ప్రపంచ సంగ్రామం ముగిసిన 1918 నాటికి మరో నాలుగు విశ్వవిద్యాలయాలను నెలకొల్పడం జరిగింది. మన దేశానికి స్వాతంత్ర్యం లభించిన నాటికి మొత్తం 21 విశ్వవిద్యాలయాలు వెలసినవి. స్వాతంత్ర్యం లభించిన తర్వాత మాత్రమే కళాశాల స్థాయిలో విస్తృత ప్రాతిపదికపై విద్యాభివృద్ధి జరిగింది. నేడు దేశంలో 9 విశ్వవిద్యాలయ స్థాయి విద్యాసంస్థలతో పాటు 62 విశ్వ విద్యాలయాలు ఉన్నాయి. మన రాష్ట్రంలో వ్యవసాయ విశ్వవిద్యాలయంతో సహా నాలుగు విశ్వ విద్యాలయాలు ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో సాధారణ విద్యాబోధనకు 146 కళాశాలలు ఉన్నాయి. (121 దైనిక కళాశాలలు. 25 సాయం కళాశాలలు) దైనిక కళాశాలలో 25 స్త్రీల కళాశాలలు ఉన్నాయి 10 ఉపాధ్యాయ శిక్షణ కళాశాలలు, ఒక ఫిజికల్ విద్యా కళాశాల ఉన్నాయి.

మూడవ ప్రణాళికా కాలంలో సాధారణ విద్యా బోధనకు సంబంధించిన కళాశాలలలో అదనంగా 17,000 మంది విద్యార్థులకు ప్రవేశం కల్పించాలన్నది మన లక్ష్యం. ఈ లక్ష్యాన్ని సాధించడం జరిగింది నాలుగవ ప్రణాళికా కాలంలో అదనంగా 20,000 మంది విద్యార్థులకు ప్రవేశం కల్పించాలని లక్ష్యంగా నిర్ణయించారు. ఈ ప్రణాళికా కాలంలో ప్రతి సంవత్సరం 4,000 చొప్పున ప్రవేశం కల్పిస్తారు ప్రస్తుతం ఉన్న కళాశాలలలో సీట్ల సంఖ్యను ఎక్కువచేయడం, కొత్త కళాశాలలను నెలకొల్పడం ద్వారా యీ లక్ష్యాన్ని సాధించడం జరుగుతుంది. సైన్సు విషయాలకు ఎక్కువ డిమాండు ఉన్నది

కళాశాలల స్థాయి విద్యా విషయంలో ప్రథమంలో రెండు సంవత్సరాల ఇంటర్‌మీడియట్ కోర్సు, ఆ తరువాత రెండు సంవత్సరాల డిగ్రీ కోర్సు ఉండేవి. అయితే రాధాకృష్ణన్ కమీషన్ సిఫార్సులను అనుసరించి కొత్త విధానాన్ని అనుసరించారు ఈ విధానాన్ని అనుసరించి, మెట్రికులేషన్ తర్వాత ఒక సంవత్సరం పి. యు. సి; మూడు సంవత్సరాల డిగ్రీ కోర్సును ప్రవేశపెట్టారు 1955–56 నుండి ఉస్మానియా విశ్వ విద్యాలయం వారు యీ కొత్తవిధానాన్ని అమలు జరిపారు. 1956–57 సంవత్సరంనుండి ఆంధ్ర. వేంకటేశ్వర విశ్వవిద్యాలయాలు యీ కొత్తవిధానాన్ని అమలు జరిపాయి. మన రాష్ట్రములో అమలు జరిపిన కొత్తవిధానంలోని ముఖ్య అంశాలను దిగువ యివ్వడం జరిగింది:—

1. వ్యక్తిగతంగా ఎక్కువ శ్రద్ధాసక్తులు కనబరచడానికి వీలుగా తరగతులలో విద్యార్థుల సంఖ్యను తగ్గించడం జరిగింది.

2. బి. ఎ; బి. ఎస్సీ. రెండు కోర్సులలోను సమాన ప్రాముఖ్యతగల మూడు ఐచ్ఛిక విషయాల ఎన్నిక విధానాన్ని విశ్వ విద్యాలయాలు అనుసరించాయి. కోర్సు నిర్వహణకు కనీస సమన్వయం ఏర్పాటు చేయడానికి మరికొన్ని అదనపు సబ్జెక్టులను ప్రవేశ పెట్టాల్సిన అవసరం ఏర్పడింది.

3 పూర్వపు బి. ఎస్సీ; బి కాం. సిలబస్‌లలో పార్ట్ I భాగం క్రింద బోధించే భాష స్థాయి, బి. ఎ. లోని స్థాయికన్నా తక్కువగా ఉండేది ఐతే కొత్త విద్యా విధానంలో అన్ని విధాలైన డిగ్రీ కొర్సులలో పార్టు I విభాగము క్రింద బోధించే భాషలకు చెందిన సిలబస్‌ను ఒకేవిధంగా రూపొందించడం జరిగింది.

కొత్త విద్యా విధానం అమలు ఫలితంగా అదనపు వసతి సౌకర్యం, పరికరాలు, అదనపు సిబ్బంది నియామకం మొదలైన వాటికి చెప్పుకోదగిన మొత్తాన్ని ఖర్చు చేయాల్సి వచ్చింది. నాలుగవ ప్రణాళికా కాలంలో పోస్ట్ గ్రాడ్యుయేట్ కేంద్రాలు, డిగ్రీ విద్యా కళాశాలలను నెలకొల్పాలని రాష్ట్ర ప్రభుత్వం ఉద్దేశించింది.

1961 మార్చి 1 వ తేదీనుండి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం రాష్ట్రంలోని అనుబంధ కళాశాలలన్నింటిలో యు జి సి. జీతాల స్కేళ్లను ప్రవేశ పెట్టింది. యు. జి. సి. జీతాలస్కేళ్లను అమలు జరపడానికి వీలుగా విశ్వవిద్యాలయాలకు ఆర్థిక సహాయం అందజేయడం జరిగింది.

కళాశాల విద్యా స్థాయిలో కొత్త విద్యా విధానాన్ని అమలు జరపడం, యు. జి. సి స్కేళ్లను ప్రవేశ పెట్టడంవల్ల పెరుగుతున్న నిర్వహణపు ఖర్చులను భరించడం కష్టసాధ్యమౌతున్నదని, కళాశాలలను నిర్వహించే ప్రయివేటు మేనేజిమెంటువారందరు ప్రభుత్వ సహాయాన్ని అర్థించారు. వారి కోర్కెను ఆంధ్రప్రదేశ ప్రభుత్వం, సానుభూతితో పరిశీలించి సహాయక గ్రాంట్ల విధానాన్ని కూలంకషంగా పరిశీలించడానికి ఒక ఉన్నత స్థాయి సంఘాన్ని నియమించింది. ఈ సంఘం చేసిన సిఫారసులన్నింటిని ప్రభుత్వం ఆమోదించి, యు. జి. సి జీతాల స్కేళ్ల ప్రాతిపదికపై సహాయక కళాశాలలకు బోధనా గ్రాంటు లభించే విధంగా సహాయక గ్రాంట్ల విధానాన్ని సడలించింది. విశ్వ విద్యాలయాల

ప్రతినిధులు, డిపార్టుమెంటు ప్రతినిధులతో కూడిన సంఘం, అనుబంధ కళాశాలలన్నిటినీ వార్షిక తనిఖీ జరిపేందుకు వీలుగా విశ్వ విద్యాలయాల సమ్మతితో ఒక వ్యవస్థను ఏర్పాటుచేసే ఆలోచన ప్రభుత్వ పరిశీలనలో ఉంది.

ఇంతకుముందు కళాశాలలకు జీతాల చెల్లింపు తర్వాతనే ఆ ప్రాతిపదికపై బోధనా గ్రాంట్లు మంజూరు చేసేవారు. ఇప్పుడు యీ గ్రాంట్లను అదే సంవత్సరం ఇస్తున్నారు.

విద్యా ప్రమాణాలను గురించి, ఉన్నత విద్యారంగంలో క్రమశిక్షణనుగురించి దేశమంతటా ఆందోళన వ్యక్తమవుతున్నది. స్వాతంత్ర్యం లభించిన నాటినుండి విద్యారంగంలో జరిగిన అధిక ఖర్చులకు అనుగుణంగా ఆశించిన ఫలితాలు లభించకపోవడం నిరాశను కలిగిస్తున్నది. స్వాతంత్ర్యం లభించిన తర్వాత అభివృద్ధి పథంలో ఉన్న మన దేశం ఎదుర్కొంటున్న నిరక్షరాస్యత, దారిద్ర్యం, వ్యాధులు మొదలైన సమస్యల పరిష్కారానికి అనుగుణంగా విద్యా విధానాన్ని పూర్తిగా సంస్కరించాల్సింది. ఆర్థిక పురోభివృద్ధికి నిర్దేశించిన పథకాల అమలులో ఉత్సాహంతో పాల్గొంటూ జాతీయ సమైక్యతకు కృషిచేసే తత్వాన్నీ, క్రమశిక్షణనూ యువతీ యువకులలో కల్పించే విషయంలో ఉన్నత విద్య తగిన కృషి చేయలేక పోయిందని నేడు ఫిర్యాదు వినిపిస్తున్నది. ఈ పరిస్థితులకు ఆందోళన చెందిన భారత ప్రభుత్వం, డా॥ డి. ఎస్. కొఠారి అధ్యక్షతన విద్యా కమిషన్‌ను ఏర్పాటు చేసింది. బడుగుజాతి అవసరాలను, సమస్యలను దృష్టిలో ఉంచుకొని అన్ని స్థాయిలలో విద్యా విషయాలను కూలంకషంగా పరిశీలించి తగిన సిఫార్సులను సూచించాల్సిందిగా యీ కమిషన్‌ను కోరారు. దేశంలో నేటికీ నిరక్షరాస్యుల సంఖ్య అధికంగానేఉంది. స్వాతంత్ర్యం లభించి 20 సంవత్సరాలు గడచినప్పటికీ అక్షరాస్యులు, గ్రామీణ నిరక్షరాస్యుల సంఖ్యలో గల వ్యత్యాసాన్ని రూపుమాపడానికి తగిన విధానాన్ని రూపొందించడం జరగలేదు. విద్యాస్థాయి, క్రమశిక్షణ లోపాలను ఎదుర్కొంటున్న తరుణంలో కొఠారి కమిషన్ సమయానికి తమ నివేదికను సమర్పించింది. విద్యకు సంబంధించిన ముఖ్యమైన వివిధ అంశాలను యీ కమిషన్ పరిశీలించి ప్రత్యేక సమస్యలపై స్పష్టమైన సిఫారసులను చేసింది. అంతేకాక విద్యాభివృద్ధికి సంబంధించిన యితర అంశాలపైకూడా సూచనలు చేసింది.

మనది వెనుకబడ దేశం; అందువల్ల విద్యారంగం మీద మనం ఖర్చుచేసే డబ్బు సవ్యమైన ఫలితాలను సాధించేదిగా ఉండాలి. మన ప్రజాస్వామిక ప్రభుత్వాలను ఎన్నుకోవడానికి మన రిపబ్లిక్ వయోజనులకు యిస్తున్న ప్రాధాన్యం దృష్ట్యా కనీసం సెకండరీ స్థాయి వరకైనా ఉచిత నిర్బంధ విద్యను గరపవలసిన అవసరాన్ని నేను పూర్తిగా గుర్తిస్తున్నాను. ఉన్నత విద్యకు సంబంధించినంతవరకు విద్యార్థులు, ఉపాధ్యాయులు రెండు వర్గాల విషయంలోను సంపూర్ణమైన ఎంపిక విధానం ఉండాలని, యీ దశలో మన పెట్టుబడి వృధా కారాదని నా దృఢవిశ్వాసం. విద్యార్థుల, ఉపాధ్యాయుల దొసగుల సరళిని వివరంగా పరిశీలించి యిరుపక్షాలకు సంబంధించిన ఒక ప్రవర్తనా నియమావళిని రూపొందించవలసిన సమయం ఇక మించిపోరాదు. ఉపాధ్యాయుల సామర్థ్యాన్ని పెంపొందించడానికి కళాశాల స్థాయిలో ప్రయివేటు ట్యూషన్లను లంచగొండిచర్యగా నిషేధించాలి; సామర్థ్యం పెంపొందే నిమిత్తం వేసవికాలం శిక్షణా తరగతులు, పరిశోధనా సౌకర్యాలు, ప్రతిభావంతమైన బోధనా కార్యక్రమాలు వంటి యితర చర్యల్నిగూడ రూపొందించి అమలుచేయాలి. సరియైన బోధన తదితర పద్ధతులద్వారాను, పాఠ్యభాగేతరమైన కార్యక్రమాలద్వారాను, సాంఘిక సేవా కార్యక్రమాలు, సెలవుల సమయంలో ఉద్యోగ కల్పనవంటి వివిధ సౌకర్యాల ద్వారాను విద్యార్థుల శ్రేయస్సుకు, విద్యా ప్రమాణాలకు, క్రమశిక్షణకు దోహదం చెయ్యాలి.

అభివృద్ధి చెందిన దేశాలయందు అమలులోవున్న విద్యతో పోల్చినప్పుడు మన విద్యచాలా వెనుకబడి ఉందని తెలుస్తుంది. విద్య సుసంపన్నం కావడానికి వీలుగా యిప్పుడున్న పాఠ్యభాగాల్ని, వివిధ దశల్లో మార్పు చేయక తప్పదు. సెకండరీ స్థాయి విద్య చాలా క్లిష్టమైంది; అందుచేత ఆ స్థాయిలోని పాఠ్యభాగాన్ని పునర్వ్యవస్థీకరించడం అనివార్యం. ఇందుకు తొలిచర్యగా, సెకండరీ స్థాయిలోని అవసరాలకు అనుగుణ్యమైన సిబ్బందిని తయారు చేయడానికి వీలుగా విశ్వవిద్యాలయాలు ముందుగానే కళాశాల పాఠ్యక్రమాలకి కొత్తరూపం యివ్వాలి.

మేధావుల్ని స్వేచ్ఛగా ఆలోచించేటట్టు చేయడం, అవిరళమైన కృషికి, నాయకత్వానికి తగినట్లుగా మేధావుల్ని రూపొందించడం ఏ ప్రజాస్వామ్యంలోనైనా విశ్వవిద్యాలయాలు నిర్వహించవలసిన ప్రధాన పాత్ర. 1947లో స్వతంత్ర జాతిగా యేర్పడినప్పుడు శ్రేయోరాజ్యానికి అత్యుత్తమమైన వాటన్నింటిని–లౌకిక వ్యవస్థను, రిపబ్లికన్ రాజ్యాంగ చట్టాన్ని, ప్రజాస్వామిక ప్రభుత్వ విధానాన్ని–భారత దేశం యెంపిక చేసుకుంది. అప్పుడు అలుముకొని ఉన్న ఆకలి, అజ్ఞానం, అనారోగ్యం వంటి పరిస్థితుల్లో నిజంగా యీ ఆశయాలు భారత నాయకుల అత్యున్నత ఆకాంక్షల్ని ప్రతి బింబించినవి. నెమ్మదిగా అయితేనేం నిశ్చయంగా శాంతి, అభ్యుదయాల మార్గంలో పురోగమించడానికి కంకణం కట్టుకున్న భారతదేశం విశాల దృక్పథపు విద్యలో, అవగాహనలో, కఠినమైన కృషిలో, నిర్మాణాత్మకమైన రాజనీతిజ్ఞతలో శిక్షణ పొందిన మేధావంతమైన నాయకత్వానికి అంకితం కాక తప్పదు. విజ్ఞానాన్ని, ఆలోచనా సంపదను ఫలప్రదం చేయడానికి వీలుగా, అభివృద్ధి చెందుతున్న మనదేశం అవసరాలకు అనుగుణంగా విశ్వవిద్యాలయ స్థాయి విద్యను పునరవలోకించి పునర్వ్యవస్థీకరించ వలసిన అవసరం ఉంది. ఈ కార్య నిర్వహణలో, విశ్వవిద్యాలయాలు, ఉన్నత విద్యా సంస్థల ఉత్తమ స్వరూప స్వభావాలకు భంగం కలుగకుండా మనం ఆర్థికంగా తదితర విధాలుగా అన్ని ప్రయత్నాలలో చేయవలసి ఉంటుంది; అభివృద్ధి చెందుతున్న మన దేశానికి అవసరమైన నాయకత్వాన్ని అందించేవి విశ్వవిద్యాలయాలన్న సత్యాన్ని యీ సందర్భంలో మనం సర్వదా గుర్తించ వలసి ఉంటుంది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో స్వాతంత్ర్యానికి పూర్వం (1947) ఆ తర్వాత ఉన్నత విద్యారంగంలో జరిగిన అభివృద్ధికి సంబంధించిన సంఖ్యా వివరాలు.

| విశ్వ విద్యాలయాలు | 1947 ఉస్మానియా, ఆంధ్ర | 1856_57 ఆంధ్రప్రదేశ్ అవతరణ (+ఎస్. వి. విశ్వ విద్యాలయం) | 1960_61 రెండవ ప్రణాళిక ఆఖరు | 1965_66 మూడవ ప్రణాళిక ఆఖరు (+వ్యవసాయ విశ్వ విద్యాలయం) |
|---|---|---|---|---|
| సాధారణ విద్యకు చెందిన | | | | |
| డైనిక కళాశాలలు | 27 (3 మహిళలకు) | 53 (9 మహిళలకు) | 65 (9 మహిళలకు) | 85 (17 మహిళలకు) |
| సాయం కళాశాలలు | ... | ... | 4 | 18 |
| బోధనా శిక్షణ కళాశాలలు | 2 (1 మహిళలకు) | 6 (1 మహిళలకు) | 8 (1 మహిళలకు) | 9 (1 మహిళలకు) |
| ఫిజికల్ విద్యాకళాశాలలు | ... | ... | 1 | 1 |
| ప్రాచ్య కళాశాలలు | 10 (2 మహిళలకు) | 14 (2 మహిళలకు) | 22 (2మహిళలకు) | 26 (2 మహిళలకు) |
| న్యాయ కళాశాలలు | 2 | 3 (ఒకసాయం కళాశాల) | 3 | 3 |
| వైద్య కళాశాలలు | 3 | 5 (దేశీయ వైద్యవిద్యా సంస్థలు మినహా) | 8 | 8 |
| ఇంజనీరింగ్ | 3 | 4 | 6 | 7 |
| వ్యవసాయం | ... | 2 | 3 | 3 |
| పశువైద్యం | ... | 2 | 2 | 2 |
| గృహవిజ్ఞాన శాస్త్రం | ... | 1 | 1 | 1 |

1946_47 సంవత్సరంలో సాధారణ, వృత్తి విద్యలలో ప్రవేశ సంఖ్య ఉస్మానియా విశ్వవిద్యాలయంలో 4,862, ఆంధ్ర విశ్వ విద్యాలయంలో 9,445 ఉంది. ఆ తర్వాతి సంవత్సరాలలో దిగువ విధంగాఉంది.

| | 1956_57 | | | 1960_61 | | | 1965_66 | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | బాలలు | బాలికలు | మొత్తం | బాలలు | బాలికలు | మొత్తం | బాలలు | బాలికలు | మొత్తం |
| సాధారణ విద్యాకళాశాలలు | 39780 | 4073 | 43853 | 40981 | 6070 | 47051 | 52781 | 11157 | 63938 |
| వృత్తి విద్యా కళాశాలలు | 2711 | 272 | 2983 | 10131 | 1319 | 11450 | 14063 | 2201 | 16264 |
| ప్రత్యేక విద్యాకళాశాలలు (ఓరియంటల్ అండ్ ఫిజికల్ విద్య) | 363 | 77 | 440 | 746 | 159 | 905 | 1827 | 317 | 2144 |

# మహాభారతము

తెప్పగంతుల లక్ష్మీశాస్త్రి

## 6

కుంతి చెప్పినవ్యుషితాశ్వునివృత్తాంతము విని పాండురాజు "కుంతీ ! నీవు చెప్పినది నిక్కమే కాని. వ్యుషితాశ్వుడు దేవసమానుడు కనుక ఆమహానుభావునకు అది సాధ్య మయినది. నే నంతటితపస్సంపన్నుడను కాను. కనుక నీ కొకధర్మతత్త్వ మును తెలిపెదను · వినుము. పతి తనపత్నితో చెప్పినమాట ధర్మయుక్తముగానే ఆమె భావించ వలెను. ఇది వేదవిదులు చెప్పినమాట. విశేషించి యెవనికి సంతానోత్పత్తియందు శక్తి లేదో. అట్టివాడు పుత్రార్థియై పత్నిని కోరినప్పుడు ఆమె అమాటను తప్పక అనుసరించ వలెను. నాకు పుత్రముఖదర్శనాభిలాష మిక్కుటముగ నున్నది. అంజలిబంధముతో నిన్ను వేడుకొనె దను. నాయాజ్ఞప్రకారము నీ వొకమహాతపశ్శాలినుండి గుణవంతులైనపుత్రులను కని పుత్రవంతులకు గలుగుసద్గతిని నాకు చేకూర్చుము" అని వేడుకొనెను.



పతియాజ్ఞను మీరలేక కుంతి, తనకు కన్యాత్వమునందు దుర్వాసు డిచ్చినవరమును చెప్పి 'ఇప్పుడు నేను దేవతలలో నెవరిని స్మరించి రప్పింతును? తెలుపుడు,' అని పతిని కోరెను. ఆమాటకు పాండురాజు, 'ప్రియే' అన్నిటికి ధర్మమే మూలము కనుక, మనము చేయుపని అధర్మము కాదని స్వప్రమాణముగా లోకులకు తెలుపుటకుగాను నీవు ధర్మదేవతనే ఆహ్వానింపుము. అతనివలన కురువంశోద్ధారకు డగుమహాధర్మాత్ముడు పుట్ట గలడు.

పతియాజ్ఞ గొని కుంతి దుర్వాసు డిచ్చినమంత్రమును శుచియై జపించెను. ధర్ముడు ప్రత్యక్షమై యోగమాయచేత మానవశరీరమును ధరించి కుంతికి పుత్రుని ప్రసాదించెను. చంద్రుడు జ్యేష్ఠానక్షత్రమందు, సూర్యుడు తులారాశియందు ఉండగా శుక్లపక్షమునందు, 'పూర్ణ' అనుపేరు గలపంచమీ తిథియందు, అత్యుత్తమ మైన 'అభిజిత్తు' అను ఎనిమిదవ ముహూర్తమునందు కుంతికి ధర్మాత్ము డగునొకకొడుకు పుట్టెను. ఆబాలకుడు పుట్టగనే అశరీరవాణి యిట్లు వినపడెను. "ఈ బాలుడు పెరిగి ధర్మాత్ములలో నగ్రగణ్యు డగును. భూమిలో పరాక్రమవంతుడు సత్యవంతుడు నగు రాజగును. మూడు లోకములలోను అసమాన మగుకీర్తిని, తేజస్సును సంపాదించి సత్త్వవర్తకు డనెడు ప్రసిద్ధిని బడయ గలడు" అప్పటికి గాంధారి గర్భము ధరించి ఒకయేడుమాత్రమే గడచి యుండెను.

ఆసుతుని గాంచి పాండురాజు కుంతితో ని ట్లనెను. "క్షత్రియులలో బలాఢ్యు డగుపుత్రుడు శ్రేష్ఠుడుగా భావింప బడును. కనుక బలశాలిని కనుము.'' అప్పుడు కుంతి ప్రపంచములో మహాబలశాలి యగువాయుదేవుని స్మరించి యతనియనుగ్రహము వలన అట్టిసుతునే క నె ను. అతని జననకాలము నందుగూడ అశరీరవాణి 'మూడులోకములలోను ఇంతటిబలశాలి యుండడు' అని పలికెను. ఆబాలుడు తల్లిగర్భమునుండి క్రిందపడినతోడనే ఆతాకిడిచేత పాషాణములు పొడి యయ్యెను. ఆనాడే దుర్యోధనుడుగూడ గాంధారికి పుట్టెను.

తరువాత పాండురాజు "దైవశక్తి, పౌరుషశక్తి గలపుత్రుడు అన్నివిషయములలోను త్రిలోకమాన్యు డగును. అట్టి పుత్రుని ప్రసాదించుటకు ఇంద్రుడే తగినవాడు" అని చింతించి, ఒక సంవత్సరము వ్రతాచరణము చేయ మని కుంతికి ఆజ్ఞాపించి తాను గూడ ఇంద్రునిగూర్చి ఘోరముగా తపస్సు చేసెను. ఇంద్రుడు ప్రసన్నుడై సత్పుత్రుని. ఇత్తు నని వరదానము చేసెను. ఆసంగతి కుంతికి తెలిపెను. కుంతి పతియాజ్ఞపై ఇంద్రుని స్మరించి యతనివలన మహాతేజశ్శాలి యగుపుత్రుని కనెను. అప్పుడుగూడ అశరీరవాణి యాబాలుని గొప్పగా పొగడుచు పలికెను. ఆకాశమునందు దేవగంధర్వాదులు, మహామునులు ఆబాలునిపై పుష్పవృష్టి గురిసి ప్రశంసించిరి. ఆవైభవము చూచి పాండురాజు మహానందభరితు డై అంతటితో తృప్తినందక, ఇంకను పుత్రులను కోరెను. అది విని కుంతి "రాజా! ఎంత ఆపత్కాలము సంభవించినను ముగ్గురికన్న ఎక్కువ పుత్రులను నియోగవిధిచేత కన గూడదు: నాల్గవశిశువును కనిన స్త్రీ 'స్వేచ్ఛాచారిణి' యగును. ఐదవసంతతిని కనినచో 'కులట' యగును. ఇది ధర్మవిరుద్ధము" అని చెప్పెను. ఆమాటకు పాండురాజు సమ్మతించెను.

అప్పుడు మాద్రి పాండురాజుతో ని ట్లనెను. "నాథా! నేను కుంతికన్న శ్రేష్ఠురాలను గనుక నేనే పట్టపుదేవిని కావలసిన దాన నైనప్పటికిని సర్వదా యాయింట చిన్నదాననుగానే యున్నాను. అట్లైనను నాకు దుఃఖము లేదు. గాంధారికి నూర్గురుపుత్రులు కలిగినను నాకు అసూయ లేదు. కాని నేను, కుంతి నీకు తుల్యముగా భార్యల మైనప్పటికిని ఆమెకు సంతతి కలిగెను. నాకు అభాగ్యము లేదని దుఃఖము కలుగు చున్నది. 'నానాథుడు పుత్రవంతు డైనాడు' అను సంతోషమునకు కొదువ లేదు. కాని, నాథా! 'నీవు కుంతికి చెప్పి' ఆమె తనమంత్రమహిమచేత నాకుగూడ సంతతి కలుగునట్లు చేయించుము. నాకు ఎంతచనవు ఉన్నను, ఆమె సవతి కాబట్టి నేను ఆమెను యాచించ లేను, అని వేడుకొనెను.

ఆమాట విని పాండురాజు 'మాద్రీ, నాకుగూడ ఈచింత కలదు. తప్పక ప్రయత్నించెదను.' అని చెప్పి కుంతిని రహస్యముగా పిలిచి యిట్లనెను:-కుంతీ! యెంత గొప్పప్రభావశాలు లైనను లోకములో కీర్తికై ఘనకార్యములను చేయ చుందురు. త్రిలోకాధిపత్యమును వహించికూడ ఇంద్రుడు కీర్తికాము డై యనేక యజ్ఞములను చేయ లేదా! దేవతలు, ఋషులు, మానవులు తాము పరిపూర్ణు లైనను, కీర్తి ని కోరి పుణ్యకార్యములను చేయ లేదా! అలాగే నీవుకూడ పూర్ణసంతానవతి వైనను, యశస్సును సంపాదించుట అవసరము. కనుక మాద్రికిగూడ నీమంత్రమహిమచేత సంతతిని కలిగించి, ఆపుణ్యముచేత గొప్పకీర్తిమంతురాలవు కమ్ము."

ఇట్లు పతి చెప్పగనే కుంతి, 'ఒక్కసారిమాత్రము నీవు కోరినదేవతను స్మరించుము. అతడు నీకు పుత్రుని ప్రసాదించ గలడు.' అని మాద్రితో చెప్పెను. అప్పుడు మాద్రి తనకు రెండవఅవకాశము దొరక దని యిరువురుసుతులను కోరున దై ఒకేపర్యాయము 'అశ్వినీదేవతలను' స్మరించెను. వారిరువురు ఒకరిని వీడి మరియొకరు ఉండరు కనుక ఇరువురు ఒక్క పర్యాయమే వచ్చి మాద్రికి ఇరువురు సుతులను ప్రసాదించిరి. ఆయిరువురును ఏకకాలమునందు జనించుటచేత 'కవలు' గా ప్రసిద్ధు లైరి. అప్పుడు 'ఈయిరువురు అశ్వినీదేవతలకన్న అధికతేజోగుణములు గలవా రగుదురు' అని అశరీరవాణి పలికెను.

శతశృంగమునందలిమునులు ఆయైదుగురుకుమారులకు వరుసగా 'యుధిష్ఠిర, భీమ, అర్జున, నకుల, సహదేవ' అను పేర్లు పెట్టి నామకరణోత్సవము యథావిధిగా చేసి వారిని ఆశీర్వదించిరి. ఆబాలురు వరుసగా ఒకరికన్న ఒకరు ఒక్కొక్క సంవత్సరము వయస్సులో చిన్నవా రైనను, దేవాంశసంభూతులు గనుక అందరును ఐదేండ్లబాలురవలెనే విరాజిల్లు చుండిరి. వారిని చూచి పాండురాజు మహానందము నందెను. కుంతిని రహస్యముగా పిలిచి, 'మాద్రికి ఇంకను సంతతి కలుగునట్లు చేయుము' అని కోరెను. ఆమాటకు కుంతి "నాథా! ఇంక నన్నడుగకుము, నామంత్రమహిమ యితరస్త్రీలయెడ ఒక్కసారే ఫలించును. మాద్రి కుతంత్రము చేసి ఒక్కసారే యిరువురిని ఆహ్వానించి యిద్దరిని కనెను, ఆమె నన్ను మోసగించెను. నేను మూర్ఖురాల నై యాయుక్తి నెరుగక 'ఒక్కసారి మాత్రమే' అని యంటిని. కుటిలస్త్రీలు ఈ విధముగానే చేయుచుందురు నన్నుమాత్రము మీ రిక అడుగ వలదు ఈ వరము నాకు మీరు ఇవ్వ వలెను." అని చెప్పి నిరాకరించెను.

ఈ విధముగా ధృతరాష్ట్రునకు నూర్గురు, పాండురాజునకు అయిదుగురు, వెరసి నూటఅయిదుగురు పుత్రులు పుట్టి కురువంశమును అతివిశాల మొనరించిరి. ఆకౌరవపాండవు లందరు కొలదికాలములోనే నీటిలో తామరపువ్వులవలె త్వరత్వరగా పెరుగుచు వచ్చిరి.

శతశృంగమునందు అందముగా క్రీడించుచున్న కుమారులను చూచుచు పాండురాజు మురియు చుండెను. ఒకనాడు వసంతఋతువులో సర్వపుష్పఫలశోభిత మైనవనములో ముచ్చటపడి పాండురాజు తిరుగుచు వనశోభకు ఆనందించు చుండెను. అతనివెంట మాద్రి కోమలవస్త్రధారిణి యై తిరుగుచు వినోదముగా మాట్లాడు చుండెను. అత డాసుందరాంగిని, సుందర వనములో, వసంతకాలమున చూచి మోహపరవశు డై ముని శాపమును మరచి, ఆమె వారించు చున్నను నవ్వుచు ఆమెను పట్టుకొనెను. కామవశునకు మృత్యుభయము ఉండదుగదా! వెంటనే అతడు మరణించెను. మాద్రి అశరీరముపైన బడి దుఃఖించు చుండెను. ఆధ్వని విని కుంతి అక్కడికి వచ్చి పతి మరణమునకు మిగుల దుఃఖించెను. తానే పతితో సహగమనమునకు పూనుకొనెను. మాద్రి, "అక్కా! నీవు సహగమనము చేయకుము నేను పతిమరణమునకు కారణభూతురాలను. ఎంత వారించినను వినక ఇత డీగతి మరణించెను. నాయందలికామముచేత మరణించెను గనుక ఇతని కామపూర్తి, లోకాంతరమున నైనను చేయుట

నాకర్తవ్యము. కనుక నేనే సహగమనము చేసెదను. దీనికి మరియొక కారణము గలదు. నీవు మరణించినచో మనపిల్లల నందరిని సమానముగా, సవతికొడుకు లనెడిభేదభావము లేక, పోషించు సహనశక్తినాకు లేదు. నీవు పెద్దదానవు. నాకన్న ఎక్కువ ఓర్పు, దయ, దాక్షిణ్యము నీకు గలవు కనుక కుమారుల నందరను కన్నకొడుకులవలె కాపాడుదువు.'' అని చితిపై ఎక్కి పతితో మరణించెను

శతశృంగనివాసు లైనమునీశ్వరులు, పరస్పరము సంప్రతించి, పాండుపుత్రులను, కుంతిని మాద్రీపాండులశరీరములతో పాటు, హస్తిపురికి తోడుకొని పోయి, భీష్మాదులకు ఒప్పగించి, వారికి, జరిగినసంగతి చెప్పి తిరిగి వచ్చిరి, అంబాలిక పుత్రశోకమున పరితపించెను. భీష్మాదులు యుధిష్ఠిరాదుల చేత ఆ మృత దేహములకు అంత్యక్రియలు యథావిధిగా జేయించిరి.

ఇట్లు సంభవించినరాజదంపతుల దుర్మరణమునకు మిక్కిలి విలపించుచున్న సత్యవతిని ఊరడించుటకు వ్యాసుడు వచ్చెను. ''సుఖకాలము దాటిపోయెను. భవిష్యత్తులో అతిభయంకరమైన కాలము రానున్నది. ఉత్తరోత్తర చెడు దినములు వచ్చును. పృథివియొక్క యౌవనము గతించెను. అనేకకపటములు, పాపకృత్యములు, ధర్మలుప్త మైన నడవడికతో గూడినమహాఘోర మైనకాలము రానున్నది. అవినీతిపరులైన కౌరవులవలన భూమండల మంతయు నశించ నున్నది. కనుక తల్లీ! నీవు ఈనగరము వీడి తపోవనమునకు పోయి యోగినివై యుండుము. కురువంశమునకు కలుగ బోవునాశమును చూడకుము" అని వ్యాసుడు తల్లికి బోధించి ఆమెను ఒప్పించెను. కోడలైన అంబికకుగూడ 'నీపౌత్రుడు దుర్యోధనుడు కారణముగా కులక్షయము, జననాశము కలుగ నున్నది. ఈఘోరమును చూడకుండ నీవు, అంబాలిక యిరువురుగూడ తపోవనమునకు రండు" అని ఆముగ్గురుస్త్రీలను దోడుకొని వ్యాసుడు వనమునకు పోయెను. ఆముగ్గురు ఘోర మైనతపస్సు చేసి పుణ్యలోకమును చేరుకొనిరి.

కురుకుమారులందరు భీష్మాదులపోషణములో పెరుగుచు సర్వసుఖములను అనుభవించుచు హాయిగా నుండిరి. భీముడు అందరికన్న బలశాలి యై దుర్యోధనాదులను క్రీడలలో బాధపెట్టుచు నుండెను. ఇట్లు క్రమముగా కౌరవులకు పాండవులకు, విశేషించి భీమునకు స్పర్ధ పెరుగుచు వచ్చెను, దుర్యోధనుడు భీమునిబలపరాక్రమములు సహించలేక బాల్యమునుండియే మాయోపాయముల చేత అతనిని చంపుటకు ప్రయత్నించు చుండెను. భీముడు తన సోదరులపైన ఈగకూడ వాలనీయకుండ వారిని కాపాడుచు దుర్యోధనాదుల అసూయకు పాత్రు డయ్యెను. భీముడు నిద్రించు చుండగా అతనిని బంధించి గంగలో ద్రోసి చంపి, యుధిష్ఠిరుని బంధములో పెట్టి తానే రాజ్యమును ఏల వలె నని దుర్యోధనుడు దుష్టసోదరులతో సర్వదా సంకల్పించు చుండెను.

ఒకనాడు దుర్యోధనుడు బాలక్రీడ కై అందరిని పురికొల్పి గంగాతీరమునకు తోడుకొని పోయెను. అచ్చట ఆహార పదార్థములలో విషము పెట్టించి భీమునికి తినిపించెను. జలక్రీడ చేసినతరువాత అలసినవాడై భీముడు విషప్రకోపముచేత కనులు మూతవడి గాఢముగా నిద్రించెను. అప్పు డతనిని బంధింగ దుర్యోధనాదులు రహస్యముగా గంగలో ద్రోసిరి. అచ్చట నాగ లోకములోని అనేకసర్పములు వచ్చి యతనిని చుట్టి కరచెను. కాని ఇనుమువంటిఅతనిచర్మమును ఆవిషము భేదించలేకపోయెను. కొంతసేపటికి అతడు తేరుకొని తనశరీరబంధములను త్రెంపుకొని తనను బాధించుటకు చుట్టుముట్టిన సర్పముల నన్నింటిని పట్టుకొని భూమిపై విసరుచు కొట్టుచు బాధించి చంపు చుండెను.



చావగా మిగిలినకొన్ని సర్పములు పారిపోయెను. సర్పరాజైనవాసుకికి ఆసమాచారమును నాగకుమారు లెల్లరు తెలిపిరి. వాసుకి యితర నాగరాజులతోపాటు అచ్చటికి పోయి భీమసేనుని చూచెను. అప్పుడు 'ఆర్యకుడు' అను నాగరాజు భీముని చూచి అత్యాదరముతో ఆ లింగనము చేసికొనెను. ఆర్యకుడు, భీమసేనుని మాతామహుడైన శూరసేనునకు మాతామహుడు. అతడు తనదౌహిత్రదౌహిత్రుని ప్రేమించి యతనికి శుభము చేయదలచెను. వాసుకి భీమునకు సువర్ణరత్న ధనరాసులను బహూకరింప దలచెను. ఆర్యకుడు వారించి. నాగలోకములో భద్రపరచ బడినకుండలోని రసమును భీమునకు పానము చేయించెను. అమృతోపమాన మైన ఆరసమును త్రాగుటచేత భీమునకు వేయి యేనుగులబలము కలిగెను. ఈ విధముగా భీముడు ఎనిమిది కడవల రసమును యథేచ్ఛగా పానముచేసి సుఖముగా నిద్రించెను. దానివలన పదివేల గజముల బలముగలవా డైనభీముడు 'గజాయుత బలుడు' అని లోకములో ప్రసిద్ధి గాంచెను.

భీమసేనుడు ముందే వెడలినాడని చెప్పి దుర్యోధనుడు అందరితోపాటు హస్తిపురికి తిరిగి వచ్చెను. భీముని కానక పాండవులు తల్లి నడిగిరి. ఆమె కేమియు తోచక విలపించుచు విదురు నడిగెను. విదురుడు చింత చేయకుము. నీపుత్రులు దీర్ఘాయుష్మంతులని వ్యాసభగవానుడు చెప్పియుండెను. ఇప్పుడు గగ్గోలు చేసినచో దుష్టుడు దుర్యోధనుడు నీయితరపుత్రులనుగూడ బాధించును. భీముడు క్షేమముగా తిరిగి వచ్చును. అని కుంతీదేవి నూరడించెను.

నాగలోకములో భీముడు రసపానముచేత సుఖముగా ఎనిమిదిదినములు నిద్రించి లేచెను. నాగులతనిని ఆదరించి విషహరములైన ఔషధులచేత సుగంధపరమాన్నమును చేసి అతనికి త్రాపి, ఆశీర్వదించి పంపిరి. భీముడు తల్లివద్దకు వచ్చి ఆమెకు, అన్నకు నమస్కరించెను. అనుజులను ఆలింగనము చేసికొని వారిని సంతోషపరిచెను. జరిగినసమాచారమును వారికి తెలిపెను.

దుర్యోధనాదులు, అప్పుడప్పుడు భీమునకు ఆహారములో విషము పెట్టుచుండిరి. అది ఆబలశాలిఉదరములో జీర్ణమగుచుండెను. ఈవిధముగా దుర్యోధనాదులు, శకునియు అనేక మాయోపాయములచే పాండవులనాశముకొరకు ప్రయత్నించుచున్నను, విదురుని ఉపదేశములచేత, పాండవులు ఉద్రేకము మాని శాంతులై కాలము గడపుచుండిరి. ఇట్లు అల్లరిగా తిరుగుచుండినకురు కుమారులకు విద్యాభ్యాసము చేయించ దలచి ధృతరాష్ట్రుడు' ధనుర్వేద పండితుడు, వేదశాస్త్రాదిపారంగతుడు నైనకృపాచార్యులను రప్పించి ఆయనకు కుమారులను అప్పగించి విద్యలు నేర్పుడని వేడుకొనెను.

## కృపాచార్యుల జన్మకథ

'గౌతమ' మహామునికి 'శరద్వంతుడు' అనుపుత్రుడు ఉండెను. అతడు సాంగధనుర్వేదవిదుడై ఘోరతపస్సు చేయుచుండెను, ఆతపస్సుకు భయపడి యింద్రుడు అతని తపస్సుకు భంగము కలిగించుటకు 'జానపది' యను అప్సరస్త్రీని పంపెను, ఆమె సౌందర్యమునకు ముగ్ధుడయినను, శరద్వంతుడు తపోబలముచేత స్థిరముగా నిలిచియుండెను, కాని అప్రయత్నముగా నతనిరేతస్సు స్ఖలనము చెంది రెల్లుగడ్డివనములో పడి రెండుగా చీలిపోయెను, అందుండి యిరువురు స్త్రీపురుషశిశువులు కలిగిరి. ఆవనములో తిరుగాడుచున్న శాంతనుడు ఆశిశువులను చూచి కృపతో ఇంటికి తెచ్చి పెంచెను, కృపతో రక్షింపబడినారు గనుక వారికి 'కృపుడు. కృపి' యని నామకరణము చేసెను. ఈసంగతి యోగదృష్టితో శరద్వంతుడు కనిపెట్టి రహస్యముగా హస్తిపురికి వచ్చి తనకొడుకునకు తనగోత్రమును తెలిపి, సకలవిద్యలను ధనుర్విద్యతోపాటు అనుగ్రహించి పోయెను, ఆయన కురుకుమారులకు అస్త్రవిద్య, యితర విద్యలు నేర్పుచుండెను.

భీష్ముడు తనకుమారులను శస్త్రాస్త్రవిద్యలలో పారంగతులను చేయ దలచి ఆవిద్యలలో మహావిద్వాంసుడైనద్రోణాచార్యులకు కురుకుమారులను ఒప్పగించ దలచెను.

## ద్రోణాచార్యుల జన్మకథ

జనమేజయుడు వైశంపాయనుని, 'ద్రోణాచార్యులెవరి కొడుకు? ఎవరివద్ద శస్త్రాభ్యాసము చేసెను? కురువంశమునెట్లు చేరెను? అతనికి అశ్వత్థామ యెట్లు జనించెను?" అని ప్రశ్నించెను. వైశంపాయనుడిట్లు చెప్పదొడగెను.

గంగాద్వారము (హరిద్వారము) నందు 'భరద్వాజుడు' అనుమహాముని కఠోరతపస్సు చేయుచుండెను. ఒకనాడు ఒక విశిష్టయజ్ఞమును చేయ తలపెట్టి భరద్వాజుడు తనతోడిమునులతో స్నానము చేయుటకు గంగలో దిగెను అక్కడ అంతకుపూర్వమే 'ఘృతాచి' యనునప్సరస్త్రీ స్నానము చేసి తీరమునందు వస్త్రమును మార్చి ధరించుచుండుటను చూచెను. అతిలోకసౌందర్యవతి, నవయౌవనవతీయు నగుఘృతాచివస్త్రము జారి పడిపోయెను. ఆయవస్థలో నున్నఆమెను భరద్వాజుడు చూచి మోహపరవశుడయ్యెను. అతనిరేతస్సు స్ఖలితమయ్యెను. దానిని ఆయన ద్రోణము (ఒక యజ్ఞకలశము) లో నుంచెను. ఆకలశమునుండి సుతుడు పుట్టెను. మహాస్త్రవిదుడైనభరద్వాజుడు అగ్నిపుత్రుడగు 'అగ్నివేశుడు' అను మునికి ఆగ్నేయాస్త్రవిద్యను నేర్పియుండెను, ఇప్పుడాయగ్నివేశుడు గురుపుత్రునకు ఆయస్త్రవిద్య నేర్పెను. ద్రోణము నుండి పుట్టినవాడు కనుక ఆకుమారుడు, ద్రోణుడు కుంభసంభవుడు 'భరద్వాజసుతుడు' కనుక భారద్వాజుడు' అను నామములతో ప్రసిద్ధుడయ్యెను.

భరద్వాజునకు పృషతుడు' అనురాజు మిత్రుడుగా నుండెను. అతడు ఉత్తరపాంచాలదేశమునకు రాజు. అతనిపుత్రుడగుద్రుపదుడు, భరద్వాజపుత్రుడగుద్రోణుడును కలిసి క్రీడించుచు అగ్నివేశునివద్ద సహాధ్యాయులుగా విద్యాభ్యాసము చేయుచు మిత్రులుగ నుండిరి.

కొంతకాలమునకు భరద్వాజుడు స్వర్గమునకు పోవుచు పుత్రుని ఆశీర్వదించి 'పెండ్లిచేసికొని పుత్రుని కనుము' అని ఆజ్ఞాపించి పోయెను. ఆప్రకారమే ద్రోణుడు గౌతమపుత్రి యగు 'కృపి'ని పెండ్లియాడి సుతుని కనెను. ఆబాలుడు జనించగనే ఉచ్చైశ్శ్రవము, అను అశ్వమువలె సకిలించెను, ఆధ్వని విని ద్రోణుడతనికి 'అశ్వత్థామ' అనుపేరు పెట్టి యతనికి సమస్తవిద్యలు, ధనుర్విద్యను నేర్పెను.

ఒకనాడు ద్రోణాచార్యులు, భృగువంశసంజాతుడైన పరశురాముడు సర్వక్షత్రియనాశము చేసి తనవశమైనసర్వసంపదలను బ్రాహ్మణులకు దానము చేయుచున్నాడు అని వినెను. పరశురాముని కడ నున్నఅమోఘములైన శస్త్రాస్త్రములను దానము తీసికొనగోరి ద్రోణుడు మహేంద్రపర్వతముపైన తపస్సు చేయుచున్నపరశురామునికడకు పోయెను. తాను దానము గోరి వచ్చితి నని యతనికి తెలిపెను, ఆతడు సంతసించి నాయనా! నావద్ద నున్నధనరాసులన్నియు బ్రాహ్మణులకు దానము చేసితిని. చతుస్సముద్రపరివృతమైనసమస్తభూమిని కశ్యపునకు దానము చేసితిని. (కశ్యపునివశములో నున్నందుచేత భూమికి కాశ్యపి యని పేరువచ్చెను.) ఇప్పుడు

నావద్ద దేహము శస్త్రాస్త్రములుమాత్రము మిగిలి యున్నవి వీటిలో నీ వేది కోరినను ఇచ్చెదను." అనెను ఆమాటకు సంతసించి ద్రోణుడు శస్త్రాస్త్రములనే కోరి తాను వచ్చినట్లు తెల్పి వాటినే యాచించెను. పరశురాముడు సంతోషించి ప్రయోగోపసంహారరహస్యములను తెలిపి తనయొద్ద నున్నదివ్యాస్త్రశస్త్రము లన్నియు ద్రోణున కిచ్చెను. వాటిని గైకొని ద్రోణుడు పరశురామునకు నమస్కరించి అతనిని వీడ్కొని పోయెను.

ద్రోణాచార్యులు తనబాల్యమిత్రుడు, సహాధ్యాయియు నగుద్రుపదు నికడకు పోయెను. ద్రుపదు డప్పుడు ఉత్తరపాంచాల దేశమునకు రాజుగా నుండెను. తాను మిత్రుడ నని ఆరాజుకు ద్రోణుడు తెలిపెను. ఆమాటకు ఆరాజు ఓర్వ లేదు. కనుబొమలు వెట్టి ముడి క్రోధముతో ఐశ్వర్యమదముతో. 'బ్రాహ్మణా! నీవు బుద్ధి పోగొట్టు కున్నావు. నేను నీకు మిత్రుడ నని చెప్పుట అసత్యము. ఇది నీధృష్టత్వమును సూచించు చున్నది. మహారాజుకు నీవంటి దరిద్రబ్రాహ్మణునితో మైత్రి యెక్కడిది? మందబుద్ధివై యిట్లు మాట్లాడు చుంటివి. మనకు బాల్యములో నుండినమైత్రి కేవలము. మనము కలిసి ఆడుకొనువరకు, చదువుకొనువరకు ఉండెను. స్వార్థముకొరకు ఆమైత్రి యేర్పడెను. కాలము గడచెను. ఇప్పు డది లేదు. నీవు దరిద్రుడవు. నేను ధనవంతుడను. సమానులకే మైత్రిగాని, వివాహముగాని కలుగును." అని చెప్పెను.

ద్రుపదునిగర్వపుమాటలు విని ప్రతాపశాలి యైనద్రోణుడు మిక్కిలి కోపముచేత ఆ రాజును చూచి, యీయవమానమునకు ప్రతిక్రియ చేయుటకు మనస్సులోనే నిశ్చయించుకొని హస్తిపురికి పోయెను.

హస్తిపురిలో కృపాచార్యునింట ఎవరికిని తెలియకుండ తనకుటుంబముతో ద్రోణు డుండెను. కృపాచార్యులు కురుకుమారులకు అధ్యాపనము చేయుట చాలించినతరువాత ద్రోణపుత్రు డగు అశ్వత్థామ వారికి ధనుర్విద్య నేర్ప దొడగెను. ఇట్లుండగా నొక నాడు కురుకుమారులు నగరమువెలుపటిమైదానములో 'గోనెబిళ్ల' (ఒక మూరెడుకొయ్యతో చిన్నమూడంగుళముల అడ్డకొయ్యను దూరముగా చిమ్మికొట్టు) ఆటను ఆడు చుండిరి. చిమ్మబడినచిన్నకొయ్య యెగిరి అక్కడినీరు లేనినూతిలో పడెను. దానిని వెలికితీయుటకు అందరు ప్రయత్నము చేసి విఫలులై యుండిరి. అక్కడనే తిరుగాడు చున్నఒకవృద్ధబ్రాహ్మణుని చూచి అతనిచుట్టుముట్టి నిరుత్సాహు లైయుండిరి. ఆయనయే ద్రోణాచార్యులు. ఆయన వారితో, 'భరత కులములో పుట్టి శస్త్రవిద్య నేర్చుకొన్నమీరీకొయ్యను నూతినుండి వెలికితీయలేని మీక్షాత్రవిద్యాబలము వ్యర్థము. చూడుడు. మీ కొయ్యను, ఈనాఉంగరమును రెంటిని నాబాణముచేత నూతినుండి యీవలికి తీసెదను, నాకుమీరు భోజనము పెట్టుడు. ఇంతియే చాలును." అని చెప్పి ద్రోణుడు తనవ్రేలినుండి ఉంగరమును తీసి యానిర్జలకూపములో వేసెను. ఒకబాణమును నూతిలోకి కొట్టి అది ఆకొయ్యకు గ్రుచ్చుకొనునట్లుచేసి ఆ బాణముమూలమున మరియొకబాణము-ఈలాగే వరుసగా నొక దానికి మరియొకబాణము చొప్పున గ్రుచ్చుచు చివరిబాణమును పట్టుకొని, త్రాటితో చేదినట్లు ఆకొయ్యను ఈవలికి తీసెను. మరియొక బాణమును కొట్టి ఉంగరమునుగూడ అస్త్రబలముచేత ఈవలికి తీయుటను చూచి కుమారు లాశ్చర్య పడిరి. 'మహానుభావా! మీ రెవరు? ఎక్కడనున్నారు? మీయస్త్ర విద్యాచాతుర్యము మేము మరియెక్కడను చూడలేదు. మీకు సాష్టాంగముగా మేము నమస్కరించు చున్నాము. మీయథార్థస్థితిని తెలుపుడు' అని వేడుకొనిరి.

ద్రోణాచార్యులు వారితో, 'మీరు భీష్మునికడకు పోయి నాగుర్తులు తెలుపుడు. ఆయన నన్ను పిలిచి మాట్లాడును; అని చెప్పెను వారు వెంటనే భీష్మునివద్దకు పోయి యీసంగతి తెలిపిరి. ఆయన, యితడు ద్రోణు డని తెలిసి పిలిపించి సత్కరించెను. ద్రోణుడు, తనకు ద్రుపదునివలన కలిగిన అవమానమును భీష్మునకు ఈవిధముగా తెలిపెను.

"భీష్మపితామహా! నేను, ద్రుపదుడు బాల్యమునందు స్నేహముతో సహాధ్యాయులముగా అగ్నివేశునికడ అస్త్రవిద్య నభ్యసించితిమి. అప్పుడు ద్రుపదుడు, 'తనకు రాజ్యాధికారము వచ్చినప్పుడు నాకు సర్వరాజ్యసుఖములను సమకూర్చెద'నని చెప్పెను. ఆతరువాత నేను తండ్రియాజ్ఞ ప్రకారము గౌతమపుత్రిని పెండ్లి చేసికొని ధర్మసంతానమును కంటిని. ఆనాసుతుడు, అశ్వత్థామ బాల్యములో నావద్ద పెరుగుచు, తోడిబాలురు పాలు త్రాగుటను చూచి తనకుగూడ, కావలె నని యేడ్చెను. నేను దరిద్రుడ నగుటచేత అతనికి పాలను ఈయలేక గోవుకై తిరిగితిని. నేను గోవును దానము పట్టుటకు తగినవ్యక్తి లభించక ఊరకే తిరిగి యింటికి వచ్చితిని. అప్పుడు తోడిబాలురు అశ్వత్థామకు బియ్యపుపిండిని నీటిలో కలిపి 'యివి పాలు' అని చెప్పి అతనికి త్రాపి, అతనిని పరిహసించు చుండుటను చూచితిని. నాకు దుఃఖము కలిగెను. అప్పుడు నా బాల్యమిత్రుడు ద్రుపదుడు రాజుగా నుండుటను ఎరిగి అతనికడకు పోయి బాల్యమైత్రిని అతని స్మృతికి తెచ్చితిని. అతడు నన్ను తిరస్కరించి ధిక్కరించెను. అట్లు అవమానపడి నేను క్రోధముతో అతనిని వీడి యిక్కడికి వచ్చితిని. మీకోరికను నెరవేర్చెదను. కోరుకొనుడు" అని చెప్పెను.

భీష్ముడు సంతసించి ద్రోణాచార్యులను సన్మానించి, 'మహాత్మా! ఈ రాజ్యమును నీయదిగా భావింపుము. ఇక్కడ నీవు కోరినసర్వసుఖములు సమకూరును, మాయదృష్టవశముచేత నీవు మాకడకు వచ్చితివి. అని చెప్పి ఆయనకు విశ్రాంతిని చేకూర్చెను. విశ్రమించి యున్నద్రోణుని కడకు భీష్ముడు వచ్చి తనమనుమలను అతనికి ఒప్పగించి,వారిని ధనుర్విద్యలో పారంగతులను చేయు మని ప్రార్థించెను. ధనధాన్యరాసులు గలిగి సర్వసుఖసంపన్న మైనభవనమును ద్రోణున కిచ్చి అందు ఆయనను నివసింప జేసెను.

ద్రోణాచార్యులు కురుకుమారులందరికి ధనుర్విద్యాగురువుగా నుండెను. వారును భక్తిశ్రద్ధలతో విద్య నేర్చు చుండిరి. ద్రోణాచార్యులు అచిరకాలములోనే కురుకుమారులకు "ముక్త, అముక్త, ముక్తాముక్త, మంత్రముక్త" అను చతుర్విధమైన ధనుర్వేదమును నేర్పెను. 'ముక్త'మనగా, శత్రువులపై విడుచు

బాణము మొదలగునవి. 'అముక్త 'మనగా, విడువక చేతిలోనే పట్టు కొని యుద్ధముచేయు ఖడ్గాదులు. 'ముక్తాముక్త' మనగా,శత్రువులపై విడుచుటకును, ఉపసంహరించుటకును అనువైన అస్త్రములు. 'మంత్రముక్తము' లనగా, మంత్రము పఠించి విడుచుటకు మాత్రము తెలియ బడునుగాని తిరిగి ఉపసంహరించుకొనుటకు తెలియ బడనిఅస్త్రములు. వీనిలో కుమారులు విశారదు లైరి.

ఒకనాడు కుమారులు రహస్యముగా తనను చుట్టి కూర్చొని యుండగా ద్రోణుడు వారితో," నాకొక ఇచ్ఛ యున్నది. మీ విద్యాభ్యాసము పూర్తి యయినతరువాత నాయిచ్ఛాపూర్తిని ఎవరు చేసెదరు" అని ప్రశ్నించెను. అందరు విని ఊరకుండిరి. అర్జునుడు లేచి 'మీయిచ్ఛను నేను పూర్తిచేసెదను'. అని ప్రతిజ్ఞ చేసెను. ద్రోణు డాతనిని ఆలింగనము చేసికొని యాశీర్వదించెను. ఇక ద్రుపదుని అణచితి ననుకొనెను

కురుకుమారులకు విద్య గరపుచు ద్రోణుడు కౌరవ పాండవులకు కమండలువుల నిచ్చి నీరు తెమ్మని నదికి ప్రతిదినము పంపు చుండెను. తనకొడుకు అశ్వత్థామకుమాత్రము వెడల్పుముఖము గల కడవ నిచ్చి పంపు చుండెను. వారు కమండలువులను నింపు లోపలఅశ్వత్థామ తనకడవను క్షణములో నింపికొని వచ్చుచుండెను. త్వరగా వచ్చినకొడుకుకు ద్రోణుడు ధనుర్విద్యారహస్యములను వారందరు వచ్చులోపల నేర్పు చుండెను. అది కనిపెట్టి అర్జునుడు వారుణాస్త్రముచేత తనకమండలువును సంకల్ప మాత్రమున నింపి కొని అశ్వత్థామకంటె పూర్వమే గురువుకడకు చేరి, అశ్వత్థామకు గురువు తెల్పువిద్యారహస్యములను శ్రద్ధగా గ్రహించెను. అది చూచి ద్రోణుడు ఆశ్చర్యమును ఆనందమును పొందెను.

'అర్జునునకు చీకటిలో ఎప్పుడుగూడ భోజనము పెట్టకుము' అని వంటవానికి ద్రోణుడు చెప్పెను. అత డట్లే చేయు చుండెను. ఒకనాడు రాత్రి అర్జునుడు భుజించునపుడు గాలిచే దీప మారిపోయినను, అంధకారములో, అభ్యాసముప్రకారము సక్రమముగనే భుజించు చుండెను. ద్రోణుడు సంతోషించెను. ఆయభ్యాస పాటవముచేత అర్జునుడు చీకటిరాత్రులలోగూడ ధనుర్విద్యాభ్యాసము చేయు చుండెను. రాత్రి ధనుష్టంకారధ్వని విని ద్రోణుడు బయటికి వచ్చి చూచి అర్జునుని కౌగలించుకొని 'నాయనా, ఈలోకములో అస్త్రవిద్యలో నీవు అసమానుడవుగా ప్రసిద్ధి చెందెదవు' అని చెప్పి యతనికి గజాశ్వరథభూములయందుండి యుద్ధము చేయుక్రమమును నేర్పెను. ఇతర కుమారులకు గదాఖడ్గాదియుద్ధములను నేర్పెను. ద్రోణునిప్రసిద్ధిని విని వేలకొలది రాజపుత్రులు వచ్చి యతనికడ విద్య నేర్చుకొనుచుండిరి.

ఒకనాడు కిరాతరాజైన 'హిరణ్యధనువు' కొడుకు 'ఏకలవ్యుడు' అనువాడు వచ్చి ధనుర్విద్య నేర్పు డని ద్రోణుని వేడుకొనెను. 'అతడు కిరాతుడు, విద్యాదానమునకు అర్హుడు కాడు' అని అతనికోర్కెను నిరాకరించెను. ద్రోణుడు కౌరవులకు విద్య గరపుటయందే యెక్కువశ్రద్ధ జూప దలచి యిది యొక నెపముగా చేసెను. ఇదియే యేకలవ్యుని నిరాకరించుటకు కారణము. ద్రోణునిచే నిరాకరింప బడి ఏకలవ్యుడు అతని పాదములను స్పృశించి నమస్కరించి భక్తిపూర్వకముగా వెడలి పోయెను. మట్టితో ద్రోణాచార్యులప్రతిమను చేసికొని, దాని యెదుట కూర్చొని దానియందు ద్రోణభావన గలవాడై ప్రయోగోప సంహారపూర్వకముగా స్వయముగానే విద్య నభ్యసించి, మంచి శరలాఘవమును గాంచెను.

ఒకనాడు ద్రోణునియాజ్ఞ బూని కుమారులు వేటకై యడవికి పోయిరి. వారివెంట వేటసామగ్రిని, వేటకుక్కను తీసికొని ఒక పురుషుడు పోయెను. ఆకుక్క అడవిలో తిరుగుచు, మలినాంగుడై వికారరూపములో నున్న యేకలవ్యునిచూచి బిగ్గరగా మొరిగెను. అది సహించక ఏకలవ్యుడు దానినోటిలో ఒకేసారి యేడు బాణములను సంధించి కరలాఘవముచేత కొట్టెను. అవి దానినోటిలో గ్రుచ్చుకొనెను. అట్లే కురుకుమారులకడకు వచ్చెను. దానిని చూచి వారు ఆశ్చర్యపడిరి. అతనిని వెతకి కనుగొనిరి. అతడు నిరంతరము బాణప్రయోగము నభ్యసించు చుండెను. 'నీవెవరు?' అని అడిగిరి. నేను నిషాదుడను, ద్రోణశిష్యుడను.' అని అతడు బదులు చెప్పెను. అది విని వారు తిరిగి వచ్చి ఆసంగతి గురువునకు తెలిపిరి. అర్జునుడు ఏకాంతమునందు గురువును సమీపించి, చనవుచేత "స్వామీ! నాకంటె అధికుడు ధనుర్విద్యలో ఈభూమండలములో నుండడు. అని చెప్పితిరి. లోకములో అందరికంటె అధికునిగా నిషాదుని మీరే ధనుర్విద్యా పారంగతుని చేసితిరి. ఇది న్యాయమా?" అని అడిగెను.

ద్రోణుడు క్షణమాత్రము చింతించి అర్జునునితో ఏకలవ్యుని కడకు పోయెను. గురువును చూచి అతడు భక్తితో నమస్కరించెను స్వామీ: తమకు శిష్యుడ నని చెప్పెను. నీవు శిష్యుడవైనచో గురుదక్షిణ యిమ్ము' అని ద్రోణు డడిగెను.' గురువునకు ఈయరాని దేదియు లేదు. మీరు కోరినదక్షిణ నిచ్చెదను". అని అత డనెను. నీకుడిచేతిబొటనవ్రేలిని ఇమ్ము' అనెను. ఏకలవ్యుడు ఏమాత్రము సందేహించక భక్తితో అంగుష్ఠమును ఛేదించి యిచ్చెను. గురువు సంతోషించి యతనికి 'చూపుడు వ్రేలు, నడిమివ్రేలుతో బాణము పట్టుకొని విడుచుటకు ఉపాయము నేర్పెను. అత డట్లు చేసెనుగాని శరప్రయోగమునందు పూర్వపులాఘవము అతనికి లేకపోయెను. అది చూచి అర్జునుడు తృప్తి పడెను.

గదాయుద్ధములో భీమదుర్యోధనులు, ఖడ్గయుద్ధములో నకులసహదేవులు, అస్త్రరహస్యజ్ఞానమునందు అశ్వత్థామ, రథయుద్ధమునందు యుధిష్ఠిరుడు, అన్నియుద్ధవిద్యలందు అర్జునుడు, లోకములో అసమాను లని ప్రఖ్యాతి గాంచిరి. భీముడు బలాధికుడని అర్జునుడు అస్త్రవిద్యాధికు డని వారిని చూచి దుర్యోధనాదులు ఓర్వలే కుండిరి.

కురుకుమారులందరికి ద్రోణాచార్యులు అస్త్రవిద్యాపరీక్ష చేయ దలచెను. ఒక కృత్రిమ మైనగ్రద్దను చేయించి ఒక చెట్టు కొనపైన ఉంచెను. ఆకుమారులను పిలిచి ఆగ్రద్దను చూపి 'దీని తలను మీరుసరిగాచూచి బాణముతో కొట్టవలె'నని చెప్పెను. తొలుత యుధిష్ఠిరుని పిలిచెను. దానిని సరిగా చూడు మనెను. అతడు చూచు చుండెను. 'ఆగురి దప్ప చెట్టుగాని, నేనుగాని, తోడిబాలురు

గాని, నీకు కనపడు చున్నారా ?' అని ద్రోణు డడిగెను. 'దానితో పాటు అందరు కనపడు చున్నా'రని యుధిష్ఠిరుడు చెప్పెను. 'నీవు లక్ష్యసాధనకు పనికిరావు' అని అతనిని పొమ్మనెను ఇట్లే అందరును బదులు చెప్పిరి. అందరిని ద్రోణుడు పరీక్షలో ఓడి పోయినట్లు నిర్ణయించి పొం డనెను. చివరకు అర్జునుని పిలిచి యడిగెను. 'నేను గ్రద్దను దప్ప దేనిని చూచుట లేదు' అని అతడ నెను. మరికొంత సేపటికి 'గ్రద్ద కనబడు చున్నదా ? అని ద్రోణు డడిగెను. దానికి అర్జునుడు 'గ్రద్దతల దప్ప మరియేదియునాకు కనబడుట లేదు' అని బదులు చెప్పెను ఇత డొక్కడే లక్ష్యవేధలో



సమర్థు డని గురువు నిర్ణయించి 'దానితల తెగ నేయు' మన గనే అర్జునుడు క్షణములో నరికెను. ద్రోణుడు సంతసించి అర్జునుని ఆలింగనము చేసికొని 'ఇక ద్రుపదుడు నావశు డయ్యె' ననుకొనెను.

ఒకనాడు ద్రోణుడు సశిష్యు డై గంగానదికి పోయి స్నానము చేయుటకు నీటిలో దిగెను. అప్పుడు ఒక మొసలి ద్రోణునిపిక్క పట్టు కొనెను. అతడు దానిని విడిపించుకొనుటకు స్వయముగా సమర్థు డై నను, 'దానిని చంపి నన్ను విడిపింపుడు' అని శిష్యులను కోరెను. అందరు విని యూర కుండిరి. వెంటనే అర్జునుడు ఐదు అమోఘ బాణములతో జలములో మునిగి యున్న మొసలిని చంపి గురువును విడిపించెను. 'అందరికన్న విశిష్టపరాక్రమశాలి అర్జునుడే యగును' అని నిశ్చయించుకొని ద్రోణాచార్యులు అర్జునునకు ప్రయోగోపసంహారపూర్వ కముగా 'బ్రహ్మశిరస్సు' అను అస్త్ర మును ఉపదేశించెను. 'ఈ యస్త్రమును నీవు ఎప్పుడుగూడ మనుష్యులపై ప్రయోగించ గూడదు. అట్లు చేసినచో నిది ప్రపం చమునే దహించును' అని చెప్పెను. అతడు అంగీకరించెను. 'లోకములో నీకు సమానుడు మరియొకదనుర్ధరుడు ఉండడు' అని గురువు మరియొక్కసారి ఆశీర్వదించెను.

కుమారులందరు అస్త్రవిద్యలో కౌశలము పూర్ణముగా సంపాదించినారని తెలిసికొని ద్రోణాచార్యులు వారివిద్యా ప్రదర్శ నము అందరియెదుట రంగస్థలమునందు చేయించ దలచెను. ధృతరాష్ట్రు డందుల కంగీకరించి తగునేర్పాట్లు విదురునిద్వారా చేయించెను. ఒక సుముహూర్తమునందు నగరవాసులు, రాజ సదనమువారు అందరు ఆరంగస్థలములో ప్రేక్షకులుగా చేరిరి. ఆచార్యుడు శ్వేతవస్త్ర–శ్వేతమాల్యాధరుడై రంగమధ్యమున వచ్చి నిలిచెను. యుధిష్ఠిరాదిరాజకుమారులు వరుసగా తమతమకౌశల మును చూపుట కారంభించిరి. ప్రేక్షకగణ మానందముతో చూచు చుండిరి. భీమదుర్యోధనులు గదాధారులై రంగమున నిలిచిరి. ప్రేక్షకులు గగ్గోలుపడి ఔత్సుక్యముతో చూచు చుండిరి. 'ఈ యిరువురు స్పర్ధపడి తీక్ష్ణముగా పోరాడ వచ్చును. కనుక వీరిని వారించుము. వీరి ప్రదర్శనము అవసరము లేదు ' అని ద్రోణుడు అశ్వత్థామను పంపి భీమదుర్యోధనులను నివారింప జేసెను.

ఆచార్యుడు తరువాత అర్జునుని పిలిచెను. అతడు స్వర్ణ కవచము ధనుస్సు ధరించి వచ్చి రంగములో నిలిచెను. ఇంద్ర ధనస్సుతో గూడినసంధ్యామేఘమువలె ప్రకాశించెను. గుర్వాజ్ఞ గొని అతడు తన అస్త్రవిద్యాకౌశలమును అందరికన్న మిన్నగా ప్రద ర్శించి ప్రేక్షకుల ప్రశంస నందుకొనెను.

కార్యక్రమము ముగియు చుండెను. ఇంతలో కర్ణుడు తనభుజములను చరచుచు హఠాత్తుగా రంగములోకి వచ్చెను. అందరిని కలియ జూచి నిరసన భావముతో ద్రోణకృపులకు నమస్కరించెను. అర్జునా! నీవు, గొప్పకౌశలము చూపినా నని గర్వించకుము. నీకన్న ఎక్కువ నేను చూపెదను.' అని చెప్పి కర్ణుడు ద్రోణునియాజ్ఞగొని అద్భుతముగా తనబాణవిద్యానై పుణ్యమును ప్రదర్శించెను. ప్రేక్షకులు ఆశ్చర్యానందమగ్ను లైరి. దుర్యోధనుడు, అర్జునునితోస్పర్ధపడి పోరాడ గలవీరుడు లభించెగదా! 'యని పరమానందము నంది కర్ణుని కౌగలించు కొనెను. నాకురురాజ్యమును యథేచ్ఛగా అనుభవించుచు నాకడనే యుండుము' అని కోరెను.

'అర్జుననితో ద్వంద్వయుద్ధమును చేయ గోరు చున్నాను.' అని కర్ణు డనెను. ఆమాట విని అర్జునుడు, 'కర్ణా! పిలువకుండ వచ్చినవారు, అడుగకుండ మాట్లాడువారు ఎట్టి పాపలోకమునకు పోవుదురో అట్టి లోకమునకు నీవు నాచే హతుడవై పోగలవు. అనెను. "అర్జునా, ఈరంగస్థలము వీరులందరికి సమానముగా ప్రవేశ యోగ్యము. ఇందు నీయధికార మే మున్నది ? పరాక్రమ వంతునే ధర్మము అనుసరించి రాజ్య మేలించును వ్యర్థప్రలాపములు చేయకుము. ధైర్య ముండినచో బాణములతో బదులు చెప్పుము. నేడు నీగురువుసమక్షములో నీతల నేల పడ నేసెదను." అని కర్ణు డనెను.

ద్రోణునియాజ్ఞప్రకారము అర్జునుడు కర్ణునితో తలపడుటకు సిద్ధముగ నుండెను. కర్ణునివైపు దుర్యోధనాదులు, అర్జునునివైపు భీష్మద్రోణాదులు నిలిచి చూచుచుండిరి కుంతి యిరువురు తనకొడుకులే. యెవరికి కష్టము కలుగునో యని చింతతో మూర్ఛిల్లెను. కర్ణార్జునులు ధనుర్ధరులై నిలిచి యుండగా ద్వంద్వయుద్ధతంత్ర విశారదుడైనకృపాచార్యుడు కర్ణునితో 'అర్జునుడు కుంతీసుతుడు, పాండురాజుకొడుకు, కురువంశసంభూతుడు. కర్ణా! నీవు గూడ నీమాతాపితరులపేర్లు, వంశము పేరు చెప్పి ద్వంద్వయుద్ధమునకు పూనుకొనుము. అర్జునుడు నీసంగతి తెలిసికొని, నీకులాచారవిచారములు సరియైనవైనచో నీతో ద్వంద్వయుద్ధము చేయుటకు నిర్ణయించుకొనును." అని చెప్పెను. ఆమాట విని కర్ణుడు తనకులగోత్రములు, మాతాపితృనామములు చెప్ప లేక తల వంచు కొనెను.

అప్పుడు దుర్యోధనుడు ముందుకు వచ్చి, "ఆచార్యా! రాజులను నిర్ణయించునప్పుడు మూడువిషయములు—సత్కులము, శౌర్యము, సేనాపతిత్వము—మాత్రమే చూడ వలెను. అర్జునుడు. రాజు కానివానితో యుద్ధము చేయ డనినచో, నేను కర్ణునకు అంగరాజ్య మిచ్చి పట్టాభిషేకము చేసెద" నని, వెంటనే దుర్యోధనుడు కర్ణుని అంగరాజుగా, ఆరంగస్థలములో పట్టాభిషిక్తుని చేసెను. తరువాత కర్ణుడు 'సర్వదా నేనుదుర్యోధనునితో మిత్రుడుగా నుండెద' నని శపథము చేసెను. అప్పుడు కర్ణునిపెంపుడుతండ్రి 'అధిరథుడు' అను సూతుడు ఆనందమును పట్టలేక కర్ణుని ఆలింగనము చేసికొనెను. కర్ణుడు అతనికి నమస్కరించి ఆశీస్సు గొనెను. అది చూచి భీమసేనుడు "సూతకులోత్పన్నునితో పూరువంశోత్పన్ను డైనఅర్జునుడు ద్వంద్వ యుద్ధము చేయడు. కనుక కర్ణా! నీవు చబుకు (కొరడా) పట్టుకొని రథము తోలుము. నీకు అర్హమైనపని అదియే" అని చెప్పెను.

ఆమాటకు దుర్యోధనుడు కోపించి ముందుకు వచ్చి "వృకోదరా! క్షత్రియులకు బలమే ప్రధానము. బలశాలియైన హీనక్షత్రియునితోగూడ యుద్ధము చేయుట ధర్మము. శూరుల ఉత్పత్తినిగూర్చి, నదులఉత్పత్తినిగూర్చి విచారించ గూడదు. నీటినుండి పుట్టినఅగ్ని సమస్తజగత్తునందు వ్యాపించ లేదా? దధీచిమహామునియెముకతో చేయబడిన యింద్రునివజ్రాయుధము సర్వదానవసంహారము చేయ లేదా? అగ్ని, కృత్తిక, రుద్రుడు, గంగ, ఈయందరకు పుట్టినకుమారస్వామి దేవసేనాధిపతి కాలేదా? క్షత్రియులనుండి పుట్టినబ్రాహ్మణుల నెందరినో నీ వెరుగవా? విశ్వామిత్రాదులు బ్రహ్మత్వమును పొంద లేదా? ఆచార్యుడైనద్రోణుడు కలశమునుండి పుట్ట లేదా? కృపాచార్యుడు రెల్లుగడ్డినుండి పుట్ట లేదా? ఇంత యేల? మీరు, పాండవులెట్లు పుట్టితిరో నే నెరుగనా? కవచకుండలములతో పుట్టిన మహావీరుడు కర్ణుడు. కనుక అతనిజన్మకారణమునుగూర్చి విచారించ కూడదు. ఇంతటివాడు నీచయోనియందు సంభవించునా? లేడి వ్యాఘ్రమును కనునా? కర్ణుడు అంగరాజ్యమునకే యన నేల? సమస్తపృథివీ రాజ్యమునకె అర్హుడగును ఈ నాయభిప్రాయమును సమ్మతించనివారు వెంటనే కర్ణునితో తలపడి పోరాడ వచ్చును." అని చెప్పెను.

అప్పుడు రంగస్థల మంతయు గగ్గోలుపడెను. ఇంతలో సూర్యుడు అస్తమించెను. దుర్యోధనుడు కర్ణునిచేయి పట్టుకొని స్వగృహమునకు పోయెను, ఎల్లవారును తమతమయిండ్లకు పోయిరి. కర్ణునిఅండతో దుర్యోధనునకు, అర్జునునిభయము తీరెను. కర్ణుడు దుర్యోధనునితో అత్యంతస్నేహపూర్వకముగా నుండెను. 'కర్ణునితో సమానుడైనధనుర్ధరుడు భూమండలములో లేడు' అను విశ్వాసము యుధిష్ఠిరునకుగూడ కలిగెను.

ఈవిధముగా కురుకుమారులవిద్యాభ్యాసము పూర్తియైన తరువాత ద్రోణాచార్యులు, 'ద్రుపదుని అణచుట కిదే సమయ' మని నిశ్చయించి కురుకుమారుల నందరిని పిలిచి తనకు గురుదక్షిణ యిండని కోరెను, వారును అంగీకరించిరి. 'ద్రుపదరాజును బంధించి నాకడకు తేవలె' నని ద్రోణుడు గురుదక్షిణ కోరెను. అందరును సన్నద్ధులై పాంచాలరాజధాని, కాంపిల్యనగరమునకు పోయి దాడి సలపిరి పాండవులుమాత్రము ఈవలనే ఉండిరి. దుర్యోధనాదులు ద్రుపదసైన్యముతో పోరాడి పరాజితులైరి. అప్పుడు అర్జునుడు రథికుడై, నకులసహదేవులు చక్రరక్షకులుగా, భీమసేనుడు సేనకు అగ్రగామిగా ముందుకు నడచెను. ఘోరరణములో అందరిని పరాజితులను చేసి అర్జునుడు ద్రుపదునిరథములోకి దుమికి అతనిని పట్టి బంధించి గురుపాదములకడ వైచెను. అతనిని కొట్టబోవు భీముని వారించి అర్జునుడు 'ద్రుపదుడు మనకు బాంధవుడు. అతనిని చంప గూడదు. మనము గురుదక్షిణగా మాత్రమే ద్రుపదుని తీసికొని పోవలెను.' అని చెప్పెను.

ద్రోణుడు ద్రుపదునితో 'రాచరికపుగర్వము నీ కుండెను. కనుక నీరాజ్యమును ఊడదీయించితిని. ఇప్పటికైనను బాల్యస్నేహము నీకు జ్ఞప్తికి వచ్చినదా?' అని ఆక్షేపించుచు పలికెను. దానికి ద్రుపదుడు లజ్జితుడై 'మహాత్మా' నీశక్తి అసమానము. నీతో నే నెల్లప్పటికిని స్నేహపూర్వకముగానే యుండెద' ననెను.

ఆతరువాత ద్రోణు డతనిని విడిపించి రాజ్య మిప్పించి పంపెను. ద్రుపదుడు పోయి తనరాజ్యమును గైకొని, 'ద్రోణుడు బ్రాహ్మతేజస్సంపన్నుడు. అతనిని క్షాత్రతేజముతో జయింప జాలను. కనుక అతనిని ఓడింప గలతేజశ్శాలి యగు కుమారుని దైవవరప్రసాదముచేత నేను కనవలె నని నిశ్చయించుకొనెను. (సశేషము)

# వార్తా చిత్రాలు



కేంద్ర పెట్రోలియం రసాయనిక మంత్రి శ్రీ అశోక్ మెహతా, 1966 డిసెంబరు 23 వ తేదీన హైదరాబాదు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో స్నాతకోపన్యాసం చేశారు



ఒక రీసెర్చ్ స్కాలర్ ఛాన్సెలర్ నుండి డిగ్రీ స్వీకరిస్తున్న దృశ్యం



ఆంధ్ర విశ్వవిద్యాలయం 40 వ స్నాతకోపన్యాసం చేస్తున్న డాక్టర్ సూరి భగవంతం, 1966 డిసెంబరు 10వ తేదీన వాల్తేరులో జరిగిన ఈ స్నాతకోత్సవానికి ఛాన్సెలర్ శ్రీ పట్టం ఎ. థానుపిళ్లై అధ్యక్షత వహించారు



డిగ్రీ అందుకుంటున్న ఒక అభ్యర్థిని



ఆంధ్ర ప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి. జగన్మోహనరెడ్డి డిశంబరు 16వ తేదీన హైదరాబాదు జూబిలీ హాలులో రోడ్డు ప్రమాదాల నివారణ దినాన్ని ప్రారంభించారు. ఈ ఉత్సవానికి శ్రీ వి బి రాజు అధ్యక్షత వహించారు



హైదరాబాదులో డిశంబరు 13 వ తేదీన కుటుంబనియంత్రణ పక్షోత్సవంలో అధ్యక్షోపన్యాసం చేస్తున్న దక్షిణ-కేంద్ర రైల్వే ప్రధాన వైద్యాధికారి డాక్టర్ పి. ఏ. మీనన్.



పబ్లిక్ వర్క్సు శాఖా మంత్రి శ్రీ టి. వి. రాఘవులు పబ్లిక్ గార్డెన్స్‌లో బాలల ట్రాఫిక్ శిక్షణ వారోత్సవాన్ని ప్రారంభించారు



పంచాయతీరాజ్ శాఖామంత్రి డాక్టర్ ఎం. ఎన్. లక్ష్మీనరసయ్య, డిశంబరు 20 వ తేదీన హైదరాబాదు జిల్లా పరిషత్తు కార్యాలయంలో కుటుంబ నియంత్రణ పక్షం ముగింపు కార్యక్రమంలో ప్రసంగిస్తున్న దృశ్యం







మేడ్చల్‌లో డిశంబరు 26 వ తేదీన ఏర్పాటైన వైద్య శిబిరంలో ఒక రోగిని పరీక్షిస్తున్న డాక్టర్



ఆంధ్ర ప్రదేశ్ గవర్నరు, డిశంబరు 19వ తేదీన రాజేంద్ర నగర్‌లో జాతీయ వరి సప్తాహాన్ని ప్రారంభించారు





ప్రారంభోత్సవానికి విచ్చేసిన సభికులు





గరిష్ఠ దిగుబడినిచ్చిన వరిపైరు



శ్రీమతి పొన్నమ్మ థానుపిళ్లై డిశంబరు 20వ తేదీన సికింద్రాబాదులో అంతర రాష్ట్ర జూనియర్ రెడ్‌క్రాస్ శిబిరం వద్ద ఒక ప్రదర్శనానికి ప్రారంభోత్సవం చేశారు. కార్మిక, రవాణా, సమాచార శాఖల మంత్రి శ్రీ బి. వి. గురుమూర్తి అధ్యక్షత వహించారు.



# ఆంధ్రప్రదేశ్ శాసనసభ వివిధ కమిటీల అధ్యక్షులు (1966)



కూర్చున్నవారు (ఎడమనుండి కుడికి): శ్రీ కీర్తి చంద్రదేవ్, హౌస్ కమిటీ అధ్యక్షులు (శాసనసభ); శ్రీ ఇ. అయ్యపురెడ్డి సబార్డినేట్ లెజిస్లేషన్ కమిటీ అధ్యక్షులు; శ్రీ ఎం. వి. ఎస్. సుబ్బరాజు, ప్రభుత్వ చీఫ్‌విప్; డాక్టర్ టి. వి. ఎస్. చలపతిరావు, అంచనాల సంఘం అధ్యక్షులు; శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు, పబ్లిక్ అకౌంట్స్ కమిటీ అధ్యక్షులు; శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి, ముఖ్యమంత్రి; శ్రీ బి. వి. సుబ్బారెడ్డి, స్పీకరు; శ్రీ వాసుదేవ్ కృష్ణాజీ నాయక్, డిప్యూటీ స్పీకరు, ప్రివిలేజస్, పిటిషన్స్ కమిటీల అధ్యక్షులు; శ్రీ జె. వెంగళరావు, ప్రభుత్వ హామీల సంఘం అధ్యక్షులు (శాసనసభ). శ్రీ జి. వి. చౌదరి, శాసనసభా సచివాలయం కార్యదర్శి.

నిలుచున్న వారు (ఎడమనుండి కుడికి): శ్రీ గులామ్ సుభానీ (కేర్ టేకర్); శ్రీ ఇ. సదాశివరెడ్డి. (సహాయ కార్యదర్శి); శ్రీ వి. కె. విశ్వనాథ్, (సహాయ కార్యదర్శి) శ్రీ పి. రంగారావు, శ్రీ ఎం. ఎస్. నాయుడు, శ్రీ ఎం. అంగురాజ్ (సహాయ కార్యదర్శి); శ్రీ జె. వి. రమణమూర్తి (సెక్షన్ ఆఫీసరు).



పతాక దినం నిధికి విరాళం ఇస్తున్న కార్మిక, రవాణా, సమాచార శాఖల మంత్రి శ్రీ బి. వి. గురుమూర్తి.

# శ్రీరంగం దేవాలయాలు

—ఎస్. రమేశ్

(గతసంచిక తరువాయి)

వీరసోమేశ్వర దేవుని పరిపాలనలోని 25 వ సంవత్సరంలో హొయసల రాణి సోమలదేవికి సంబంధించిన శిలాశాసనం ఒకటి వున్నది. సుందరపాండ్య అనబడే పాండ్యరాజు జాతవర్మకు సంబంధించిన శాసనాలు కూడా కొన్ని. శిథిలం కాగా మిగిలివున్నాయి. పశ్చిమాన ద్వితీయ ప్రాకారంలో కాకతీయ ప్రభువయిన ప్రతాపరుద్రుని శాసనం ఒకటి తెలుగు లిపిలో వున్నది. ఒకటవ కులోత్తుంగ చోళుడు, రెండవ కులోత్తుంగ చోళుల యొక్క శాసనాలు కూడా అనేకం వున్నాయి. శ్రీ శంకరాచార్య మఠం పశ్చిమ ప్రాకారం మీద త్రిభువన చక్రవర్తి కోనేరిన్ మైకొండన్‌కు సంబంధించిన శాసనంవుంది. దీనిలో తిరువనాయిక్కావల్ వద్ద గల దేవాలయానికి, ఉత్తరం వైపున మఠానికిని అవురుదయన్ సొలకన్ నిర్మించిన నారపట్టెన్నాయిరం మదం అనబడే భవనాన్ని గూర్చిన ప్రస్తావన వున్నది. ఇక్కడ సన్యాసులకు అన్నహారాలు అందచేసేవారట.

ఈ దేవాలయంలో వేదపాఠశాల ఒకటి నడుపబడుతున్నది. 18 వ శతాబ్దంలో ఆంగ్లేయులకు, పరాసు వారికి జరిగిన కర్నాటకయుద్ధంలో యిదిన్ని, శ్రీరంగంలోని రంగనాథదేవాలయమున్ను కోటగా వుపయోగించబడ్డాయి. తిరునయుక్కరాసు, సంబందర్, సుందరమూర్తి అనబడే ప్రసిద్ధ తమిళ యోగులు' ఆదిశంకరులవారు యీ దేవాలయాన్ని సందర్శించారని చెప్తారు.

ప్రాకారాలలో చిన్నచిన్న గూళ్ళు, మఠాలు వున్నాయి. దేవుళ్ళను ఊరేగించే రథాలను వుంచడానికి, ఏనుగులు మొదలైన వాటిని పెట్టడానికీ విశాలమైన గదులు వున్నాయి. దేవాలయ అర్చకులకు, యింకా ఆలయ నిత్యపూజాది కార్యులకు అవసరమైన తవేశ్కలకు నివాస గృహాలు వున్నాయి. దుకాణాలు వున్నాయి. అందువల్ల శ్రీరంగాన్ని ఆలయనగరం అనొచ్చు. ఆలయాలను పరివేష్ఠించి గ్రామాలు, ఊర్లు పరివ్యాప్తమై వెలసివుండే వెనకటి కాలంలోని సాంఘిక జీవితానికి తార్కాణ గా వర్తమాన కాల లో నిలచిన పట్టణం శ్రీరంగం పట్టణం.

ఈ ప్రాకారాలు కేవలం ప్రాకారాలు మాత్రమే కాదు. చిన్నచిన్న దేవుళ్ళూ, దేవతల నిమిత్తం అనేక గుడులు కూడా యీ ప్రాకారాల వెనుక వున్నాయి. ఉదాహరణకు రెండో ప్రాకారంలో గరుడ సన్నిధి, అర్జున మండపం, యాగశాల మొదలైనవి వున్నాయి. తృతీయ ప్రాకారంలో సరస్వతి సన్నిధి, హయగ్రీవ సన్నిధి, పరమపథ సింహద్వారం మొదలయినవి వున్నాయి. చతుర్థ ప్రాకారంలో పట్టాభిరామ సన్నిధి, వరాహ పెరుమాళ్ సన్నిధి, భోగరామ సన్నిధి మొదలయినవి; పంచమ ప్రాకారంలో పార్థసారథి సన్నిధి, బలిపీఠం, రంగవిలాసం, వివిధ ఆళ్వారుల సన్నిధులు: షష్టమ ప్రాకారంలో శ్రీరంగ రామానుజ జీయర్ స్వామి మఠం మొదలయినవి; సప్తమ ప్రాకారంలో ఆంజనేయ స్వామి ఆలయం, మహాదేశికారసన్నిధి, యింకా అయనార్, స్వామిమలిగై, కపిస్థలంస్వామిమలిగై, శ్రీవానమామలై మైహాన్ మొదలైన అనేకమంది స్వాములవారి మఠాలు వున్నాయి. అంతేకాదు ఈ ప్రాకారాలమధ్య అనేక నివాస గృహాలు, పాఠశాలలు, ముద్రాక్షరశాలలు, బెంచ్ కోర్టులు కూడా వున్నాయి.

రెండవ ప్రాకారంలోనే ప్రసిద్ధమైన వెయ్యి స్తంభాల హాలువుంది, దీనిలోని స్తంభాలు ఒకే శిలతో మలచబడినవి. స్తంభాల మీదముందుకు పొడుచుకొచ్చిన రీతిలో శిల్పాలు చెక్కబడి వున్నాయి.కొన్ని గోపురాలు నలభై అడుగుల ఎత్తున వున్నాయి పై మిద్దె 25 అంగుళాల ఎత్తులో వుంది. దేవాలయ సింహ ద్వారం వద్దనే అసంపూర్తిగా నిర్మింపబడిన గోపురం ఒకటి వుంది. దీనికి రాయ గోపురం అని పేరు. విజయనగర ప్రభువయిన శ్రీకృష్ణ దేవరాయలు దీని నిర్మాణం ప్రారంభించారని అది మధ్యలో ఆగి పోయిందని చెప్తారు. వాస్తు నిర్మాణ దృష్టితో చూచినప్పటికీ యీ దేవాలయం దక్షిణాది ప్రసిద్ధదేవాలయాలకు ఏమాత్రం తీసిపోదు ఇక్కడి నిర్మాణాలన్నీ శిల్పశాస్త్రప్రకారం కట్టబడినవే. ప్రసిద్ధశిల్పకళా విమర్శకులు ఫెర్గస్ అన్ రియా. గెడ్డెస్ వంటివారు యీ ఆలయ శిల్పవిజ్ఞానానికి, వాస్తునిర్మాణ గరిమకూ ఎంతగానో ప్రశంసలు కురిపించారు. ఇంచు మించు అన్ని రాతి స్తంభాల మీద అత్యద్భుతమైన శిల్పాలు ఉన్నాయి.

ఈ దేవాలయాన్ని గూర్చి ఆసక్తి కరమైన పౌరాణిక గాథ ఒకటి వున్నది. మహా ప్రళయాంతంలో శ్రీమన్నారాయణుడు జలమధ్యస్తంలో నిలిచి సృష్టినిర్మాణానికి పూనుకొని తపస్సు ప్రారంభించాడు. అప్పుడు బ్రహ్మాండము ఆవిర్భవించింది. తిరిగి దానిలోంచి జల, వాయు, పృథ్వీ, తేజో, ఆకాశ అనే పంచ భూతాలు ఉత్పన్నమయ్యాయి: అంతట బ్రహ్మదేవుడు బంగారు పద్మంలో ఆసీనుడై జలాలనుండి వెలుపలికి వచ్చి జీవసృష్టి చేశాడు. అయితే జీవితంలోని దుఃఖాలకు ఆందోళనపడి కాస్తంత ఉల్లాసాన్ని కలిగించమని విష్ణుమూర్తిని ప్రార్థించాడట బ్రహ్మ. అంతట ఒకవైపు భూదేవి, మరొకవైపు నీలదేవి కొలువు తీరివుండగా ఆదిశేషునిపై విశ్రమించిన శ్రీ రంగనాథుడిగా నారాయణుడు ప్రత్యక్ష మయ్యాడు. (సశేషం)

సీరియల్

# అడవిమల్లె

వాసిరెడ్డి సీతాదేవి

## జరిగిన కథ

ప్రసాదరావు చంద్రం అన్న ఇంటికి వెళ్ళగా అనూరాధ చూచి స్పృహ కోల్పోయి, తేరుకుంటింది. ప్రసాద్ ఆమె ప్రక్కనే కూర్చున్నాడు. ఆమెకు ముఖం చూపించలేక ఏడ్చుచున్న ప్రసాద్‌ను వారించింది. తెనాలి రైల్వే స్టేషన్‌లో అనూరాధ పడిన బాధనంతయు ప్రసాద్‌తో వెళ్ళబుచ్చుకున్నది. ప్రసాద్ తన గాథకూడ చెప్పుకొని తిరిగి తనవెంట వచ్చేయమనీ, కూతురును వెదకే బాధ్యత తనదేనని అంటాడు. గౌరి చంద్రంతో తన ప్రేమను వ్యక్తంచేస్తుంది. చంద్రం వాహ్యాళికి వెళ్ళగా అక్కడ రజని రాజాలు కనిపిస్తారు.

చంద్రం గేటు తీసుకొని లోపలకు ప్రవేశించేప్పటికి హేమ ఇంటిముందున్న తోటలో పచార్లు చేస్తూంది.

లాన్‌లో వేసివున్న ఒక కుర్చీలో తను కూర్చుంటూ చంద్రాన్ని "కూర్చో అంది, ఆమె స్వరంలో ఉదాసీనత, ముఖంలో ముఖావం, కొట్టొచ్చినట్లు కనిపిస్తున్నాయి.

చంద్రం కూర్చోలేదు, ముఖంలో కోపం, కళ్లలో అశాంతి స్పష్టంగా కనిపిస్తున్నాయి. నుదురుమీద ముడతలు కనిపిస్తున్నాయి. కుడిచెయ్యి అరచెయ్యిని మెడమీద పెట్టుకొని మెడ వెనక్కు విరుచుకుంటూ బిగిసివున్న నరాలను సడలించుకుంటున్నట్లు కనిపిస్తున్నాడు. చంద్రం అంతగా బాధపడటం చూసిన హేమకు జాలివేసింది. వెంటన చెయ్యి పట్టుకుని "ఎందుకంత బాధపడతావు? కూర్చో" అనాలనిపించింది. "కూర్చో చంద్రం!" అని మాత్రమే అనగలిగింది. ఈ సారి ఆమె స్వరంలో కొంత మృదుత్వం వుంది.

చంద్రం హేమ ముఖంలోకి చూశాడు. ఆచూపు "ఏమిటి నువ్వు! నిన్ను నేను ఎలా అర్థం చేసుకోవాలి, అంతలో నిర్లక్ష్యం అంతలో ఆత్మీయత" అన్నట్లుంది, హేమ ఆచూపును తప్పించుకోవటానికి మరో పక్కకు ఏదో శ్రద్ధగా చూస్తున్నట్లు నటించింది. ఒక్క సారిగా హేమ కుర్చీ దగ్గరకు వచ్చి నిల్చున్నాడు. హేమ వింతగా చంద్రం ముఖంలోకి చూసింది. చంద్రంలో ఇంత ఉద్రేకాన్ని ఏనాడూ చూడని హేమ గుండెలు దడదడ లాడాయి. హేమ కూర్చున్న కుర్చీ చేతులమీద చేతులు ఆనించి కొంచెం వంగి హేమ ముఖంలోకి అదోలా చూడసాగాడు, హేమకు చాలా ఇరుకుగా అనిపించింది. ఏనాడూ లేని ఏదో అనుభూతి ఆమెను ఉక్కిరి బిక్కిరి చెయ్యసాగింది. చంద్రం చూపుల తీక్షణతను తట్టుకోలేని హేమ లేచి నిల్చోబోయింది. చంద్రం ఆమెను మొరటుగా, బలంగా తన బాహువుల్లో బిగించి గుండెలకు గాఢంగా హత్తుకున్నాడు.

ఈ క్షణం కోసమే హేమ ఎదురు చూసింది, చంద్రంలో ఇలాటి ధైర్యాన్నే ఆమెకు తెలియకుండానే ఆమె కోరుకోసాగింది, ప్రేమతోకూడిన దౌర్జన్యంలోవున్న మాధుర్యం అందరికి అర్థం కాదేమో? హేమ విడిపించుకోవటానికి ప్రయత్నించసాగింది.

"ఇవ్వాళ ఏదో తేలిపోవాలి, నేనంటే నీకు అసహ్యమా! నిజం చెప్పు, మళ్లీ నీకు నాముఖం చూపించను" అన్నాడు చంద్రం పెనుగులాడుతున్న హేమను ఇంకా బలంగా గుండెలకు హత్తుకుంటూ.

హేమ పెనుగులాట మానేసింది. ఒక్క సారిగా ఆమెలో అభిజాత్యం, అభిమానం కరిగి కన్నీరుగా ప్రవహించింది. చంద్రం గుండెల్లో తల దాచుకొని వెక్కి వెక్కి ఏడవసాగింది.

"నువ్వు బాధపడుతూ నన్నెందుకిలా బాధపెడతావు చెప్పు?" అంటూ చంద్రం హేమ కన్నీటిని తుడవసాగాడు.

"చెప్పు. హేమా! నన్ను వివాహం చేసుకోవటం నీకు ఇష్టమేగదూ?"

అంగీకార సూచనగా హేమ తలవూపింది. మరుక్షణంలోనే ఎదురుగా ఏదో క్రూరమృగాన్ని చూచినట్లు బెదిరిపోతూ చంద్రం చేతుల్ని విడిపించుకుని దూరంగా నిల్చుంది.

ఎవరైనా వచ్చి వుంటారేమోనని చంద్రం గేటు వైపుకు చూశాడు. గౌరి నిల్చునివుంది. చంద్రంకు మతిపోయినంత పన యింది. వళ్లు తెలియని కోపంతో గౌరి దగ్గరకు దూసుకువెళ్లాడు.

ఆ పెద్దపెద్ద కళ్లనిండుగా కన్నీరును నింపుకొని తన ముఖంలోకే ఏదో బాధగా చూసిన గౌరిముఖం చూడగానే చంద్రం కోపం నీళ్లు కారిపోయింది.

"ఇక్కడ కెందుకొచ్చావు గౌరీ ;" అన్నాడు బాధగా.

"ప్రకాశం..." మధ్యలోనే మాటలు ఆగిపోయాయి. దుఃఖం పొర్లుకొస్తున్నది. ఏడుపుతో గొంతు పెకల్లేదు.

"ప్రకాశం...ఆఁ ఏమయింది ప్రకాశానికి" ఆదుర్దాతో అడిగాడు చంద్రం.

"ప్రకాశాన్ని పోలీసులు...."

"పోలీసులా? ప్రకాశాన్ని పోలీసులు ఏంచేశారు? త్వరగా చెప్పు?" ఇనుమడించిన ఆదుర్దాతో అడిగాడు చంద్రం.

"పోలీసులు పట్టుకెళుతున్నారు." దుఃఖం పొర్లుకొస్తుంటే అణుచుకోవటానికి ప్రయత్నిస్తుంది అసలే భయంతో వున్న గౌరి, వస్తూనే చూసిన దృశ్యంతో వికలమయి పోయింది.

"పోలీసులు ప్రకాశాన్ని పట్టుకెళుతున్నారా? పద!" అంటూ విసురుగా వెళ్ళిపోబోతున్న చంద్రం చెయ్యి పట్టుకొని ఆపింది హేమ.

ఆశ్చర్యంగా హేమ ముఖంలోకి చూశాడు. ఏదో చాలా గంభీరమైన ఆజ్ఞను ఇవ్వబోతున్న మహారాణిలా ఠీవిగా, గంభీరంగా నిల్చునివుంది హేమ. ఆమె నిల్చొనేతీరు గౌరికంటే నేను ఎంత ఎత్తుమీద వున్నానో చూడమన్నట్లుంది.

"క్షమించు హేమా! ప్రకాశాన్ని పోలీసులు పట్టుకెళుతున్నారట. అదేమిటో కనుక్కొని వస్తాను." అన్నాడు చంద్రం సానునయంగా.

"అంతా విన్నాను. నువ్వు ఇప్పుడు వెళ్ళటానికి వీలులేదు. ఖచ్చితంగా అంది హేమ.

ఇంతకాలం మరో విధమైన అభిమానం చూపించింది. ఇప్పుడేమిటి ఇంత అధికారం చేస్తుంది. చంద్రం మనస్సు సంతోషంతో నిండిపోయింది. కాని పరిస్థితి విషమిస్తుందేమోనని మరోవైపు భయపడ్డాడు.

ఆ వార్తే గౌరి కాకుండా మరొకరు తెచ్చివుంటే హేమ అలా ప్రవర్తించి వుండేది కాదేమో! హేమ తనకు తనే అనుకుంది. తను చేస్తున్నపని సబబుగా లేదేమోననిపించింది ఓ క్షణం, ఇంతవరకూ వచ్చాక తన ఆధిక్యాన్ని గౌరి ముందు నిలబెట్టుకోవాలనే పట్టుదల పెరిగింది. గౌరితో అంత ఆప్యాయంగా చంద్రం మాట్లాడటం, గౌరి ఎంతో స్వతంత్రంగా చంద్రాన్ని 'నువ్వు' అనటం, హేమకు వళ్ళు మండిపోయింది. చంద్రం ప్రేమ పరీక్షించటానికి ఇదే సమయం అనుకుంది హేమ.

చంద్రం అయోమయంలో పడ్డాడు. "నువ్వు తేల్చుకోదలచినట్లే ఇవ్వాళ నేనూ తేల్చుకోదలచాను. నీకు నేను కావాలో, ఈ జనం కావాలో తేల్చుకో" అంది హేమ దృఢంగా, ఇంకా హేమ చంద్రం చెయ్యి పట్టుకొనే వుంది. అది చూసిన గౌరికి ఏడుపువచ్చింది. తన వస్తువును ఎవరో బలవంతుడు తననుంచి లాక్కుంటున్నట్లనిపించింది గౌరికి.

వెంటనే చంద్రం రెండో చేతిని పట్టుకొంది గౌరి. "త్వరగా రా! ప్రకాశాన్ని విడిపించు" అంది గౌరి.

అది చూసిన హేమ చంద్రం చేతిని గబుక్కున వదిలేసింది. చంద్రం గౌరి చేతినుంచి తన చేతిని లాకున్నాడు.

"క్షమించు హేమా! ప్రకాశానికి నేను ఎంతో ఋణపడి వున్నాను. అదేదో కనుక్కొని ఇప్పుడే వస్తాను" అన్నాడు చంద్రం బ్రతిమాలుతున్న ధోరణిలో.

"వీల్లేదు, నీకు నేను కావాలో ఆ ప్రకాశం కావాలో తేల్చుకో. ఇప్పుడే ఇక్కడే, ఈ క్షణంలోనే" అంది అభిమానం దెబ్బతిన్న హేమ.

"అంత అవివేకంగా మాట్లాడకు హేమా! చదువుకున్న దానివి. నన్ను అర్థంచేసుకో."

హేమ జవాబు ఇవ్వలేదు. ఉబికివస్తున్న కోపాన్ని కింది పెదవిని కొరుక్కుంటూ అణచుకోవటానికి ప్రయత్నించసాగింది.

"నువ్వు నా జీవిత సర్వస్వానివి. నువ్వులేని జీవితం నాకు అక్కరలేదు. కాని ప్రకాశం నాకు నా జీవితంకంటె విలువైనది ఏదైనా ఉంటె దానితో సమానం. ప్రేమా, కర్తవ్యం. ప్రేమకోసం మానవుడు పాకులాడతాడు. అందులో స్వార్థం ఉంది, నా దృష్టిలో కర్తవ్యం తరవాతే ప్రేమ, ప్రకాశాన్ని రక్షించడం నా కర్తవ్యం. నన్ను అపార్థం చేసుకోకు హేమా!"

"అంతేనా : చివరిసారిగా మరోసారి ఆలోచించుకో!" అంది హేమ,

"ఇప్పటికే ఆలస్యం అయింది. వెళ్ళివస్తాను" అంటూ చంద్రం ముందుకుసాగాడు.

"వెళ్ళు. కాని మళ్ళీ రానక్కరలేదు" అంటూ గిర్రున తిరిగి లోపలకు వెళ్ళిపోయింది,

చంద్రం నిస్సహాయంగా హేమ వెళ్ళినవైపే చూస్తూ నిల్చుండి పోయాడు. దీర్ఘంగా నిట్టూర్చి గౌరితో బయలుదేరాడు.

గౌరికి అర్థమైందల్లా హేమ మళ్ళీ చంద్రాన్ని రావద్దని చెప్పటం. గౌరీ మనస్సు తేలికపడింది.

చంద్రం, గౌరి, పోలీస్టేషన్‌కు వెళ్ళేప్పటికే ప్రకాశాన్ని రిమాండులో ఉంచారు. చంద్రం ఫలానా అని తెలిసి జామీనుమీద ప్రకాశాన్ని వదిలారు.

ప్రకాశం చంద్రాన్ని చూడగానే హాయిగా నవ్వాడు. ప్రకాశానికి ఈ విధంగానైనా సహకరించగలిగిన అవకాశం దొరికినందుకు చంద్రం సంతృప్తిగా నిట్టూర్చాడు,

హేమ ప్రవర్తననూ. ఆమె చివరిమాటలనూ తలచుకుంటూ నడుస్తున్నాడు చంద్రం.

"ఏమిటోయ్ ! అంతగా ఆలోచిస్తున్నావ్ ?". పక్కనే నడుస్తున్న ప్రకాశం ప్రశ్నించాడు.

"అసలు నిన్ను ఎందుకు అరెస్టుచేసినట్లు ?" ప్రశ్నించాడు చంద్రం అసలువిషయాన్ని దాస్తూ.

"ఆఁ ఏమీలేదు. ఈ మధ్య అగ్నిప్రమాదాల సందర్భంగా కొందరు రౌడీలను అరెస్టుచేశారుగా ! వాళ్ళంతా దాదాపు నాగేంద్రంగూపు. వాళ్ళు నేను చెయ్యమంటే అలాచేశామని చెప్పారట."

"ఎంత అన్యాయం !"

"అన్యాయమేకాని ఇప్పుడుజరుగుతున్నది అదే. అసలు వాళ్ళుకూడా చేసి ఉండకపోవచ్చు. కక్ష వున్నవాళ్ళను ఇరికించటానికి ఇలా పట్టుబడి ఉంటారు."

"ఎంత దారుణం. ఇలాంటి కుట్రలుకూడా చేస్తారా మనుషులు."

"కుట్రలు చేయ్యటం మనుషులు చేయ్యకపోతే జంతువులు చేస్తాయా ?" తేలిగ్గా నవ్వేశాడు ప్రకాశం. చంద్రం మళ్ళీ ఆలోచనలోకి జారిపోయాడు.

"ఇంత త్వరగా నీకు ఈ వార్త ఎలాతెలిసిందోయ్ !" అడిగాడు ప్రకాశం,

"గౌరి ఉందిగా, మెరుపులా పరిగెత్తుకొచ్చింది." అన్నాడు మౌనంగా నడుస్తున్న గౌరివైపు చూస్తూ. గౌరి అసలు యీ లోకములోనే ఉన్నట్లు కనిపించలేదు. కలల్లో కరిగిపోతూ యాంత్రికంగా నడుస్తుంది.

చంద్రానికి ఆరాత్రి అన్నం సహించలేదు. ఒళ్ళంతా నొప్పులుగా ఉంది. పక్కమీద వాలటంతోటే నిద్ర పట్టేసింది.

అంత పొద్దుటే ఇంటిముందు కారు ఆగిన శబ్దంవిని చంద్రం ప్రకాశం బయటకు వచ్చారు. కారులోనుంచి కృష్ణారావు, కాంతమ్మా, రజనీ దిగటంచూసిన ఇద్దరికీ ఆశ్చర్యం కలిగింది. రజని గబగబా, పరుగెత్తుకొచ్చి చంద్రం చెయ్యి పుచ్చుకుంది.

"బాబాయ్! అమ్మా, నాన్నా నిన్ను తీసుకెళ్ళటానికి వచ్చారు" అంది గలగలలాడుతూ.

ప్రకాశం కాంతమ్మను, కృష్ణారావును లోపలకు ఆహ్వానించాడు. చంద్రం మౌనంగా లోపలకు వచ్చి కూర్చున్నాడు.

"బాబూ చంద్రం. నిన్ను నేను చాలా బాధ పెట్టాను. క్షమించు బాబూ అంది కాంతమ్మ.

ఆ మాటలు విన్న చంద్రానికి అది కలో నిజమో కూడా అర్థం కాలేదు. కళ్ళు పెద్దవి చేసుకొని కాంతమ్మ ముఖంలోకి చూశాడు. కాంతమ్మ కళ్ళలో నీరు, ముఖంలో బాధ, స్పష్టంగా కనిపిస్తున్నాయి.

'ఏంబాబు క్షమిస్తావు గదూ!' అంటూ కాంతమ్మ చంద్రం రెండు చేతులూ పట్టుకుంది.

వదినా ! నేను నిన్ను క్షమించటమేమిటి ! తల్లిలాంటి దానివి" అన్నాడు చంద్రం.

అయితే పద మన ఇంటికి వెళదాం. నాకు ఈ రోజునుంచి నువ్వు పెద్ద బిడ్డవు. నీ తరవాతదే రజని'' అంది కాంతమ్మ కళ్ళ తుడుచుకుంటు.

'అవును చంద్రం. నీవు లేని ఇంట్లో మేమూ వుండదలచుకోలేదు." అన్నాడు కృష్ణారావు.

"అన్నయ్యా''

''అవును చంద్రం. కదనకు బయలుదేరు." అన్నాడు ప్రకాశం.

కాంతమ్మా, కృష్ణారావూ ఒకరిముఖాలు ఒకరు చూసుకుని సిగ్గుపడ్డారు. ఇంత కాలం ప్రకాశాన్ని అపార్థంచేసుకున్నారు. ప్రకాశమే చంద్రాన్ని బలవంతంగా తన దగ్గిర వుంచుకున్నాడనుకున్న వారి అపోహ అరిపోయింది.

''నువ్వు ఎంతమంచివాడివి బాబు !" అంది కాంతమ్మ ప్రకాశం జవాబుగా నిండుగా నవ్వాడు.

''ప్రకాశం ఇకనుంచి నువ్వుకూడా మాతోనే వుండిపోవాలి" అన్నాడు కృష్ణారావు.

చంద్రం దృష్టిలో కృష్ణారావు ఎంతో ఎత్తున పెరిగిపోయాడు ఆ ఒక్క మాటలో.

"మీ దయకు కృతజ్ఞుణ్ణి. రోజూ చంద్రంకోసం తప్పక వస్తూవుంటాను." అన్నాడు ప్రకాశం.

''అయితే మరిబయలు దేరదామా!" అన్నాడు కృష్ణరావు లేచినిల్చుంటూ. "ఇవ్వాళ కాదు. రేపువస్తాను. ఇప్పుడు ప్రకాశం విజయవాడ వెళుతున్నాడు. రేపు మూడు గంటలకు వస్తాడు. రాగానే ఇద్దిరం వస్తాము. ఇవ్వాళ నాకు కొంచెంపని వుంది." అన్నాడు చంద్రం. చంద్రం ఆరోజు నవల పూర్తి చెయ్యదలచుకున్నాడు.

''లేదు. ఇప్పుడేరా!" అంది రజని మారాంచేస్తూ.

''లేదమ్మా ! రేపు తప్పక వస్తాగా !'' అన్నాడు చంద్రం రజనిని బతిమాలుతున్నట్లు.

"సరే రేపు సాయంత్రం నేనేవచ్చి తీసుకెళతాను.'' అంది కాంతమ్మ.

''నువ్వెందుకు వదినా! కారు పంపించండి చాలు." అన్నాడు చంద్రం.

''నేను వచ్చి తీసుకెళతానులే.'' అంటూ లేచాడు కృష్ణారావు.

(సశేషము)

# ఆంధ్రశతక వాఙ్మయ వైశిష్ట్యము

కే. గోపాలకృష్ణారావు

నన్నయభట్టారకుని యుగమునుండి నేటివఱకును ఆంధ్ర సాహిత్యము వివిధ కావ్యప్రక్రియలతోడ బరిపుష్టమై బహుముఖముగ వికాసము నొందుచున్నది. వివిధ కావ్యప్రబంధములలో శతకప్రక్రియకూడ విశిష్టమైనస్థానమును సంపాదించుకొనినది. ఆంధ్రశతకవాఙ్మయమట్టి వైశిష్ట్యము నొందుటకు గారణము నాటి నుండియు నేటివఱకును నది బహుముఖముగ విస్తరిల్లుచుండుటయే.

తెలుగు కావ్యప్రక్రియలలో కొన్ని ఒక్కొక్కయుగము నందు మాత్రమే బహుళముగ నాదరపాత్రములైనవి. పురాణ ప్రబంధకథాత్మక కావ్యములు కొన్ని యుగములందు కవులాదరింప మఱియొకయుగమున వచనములు యక్షగానములు మున్నగునవి కవులదృష్టి నాకర్షించినవి. నన్నయనాటినుండి నేటివఱకును సజీవప్రవంతి వలె ప్రవహించినది ఒకశతకప్రక్రియయే అని నిస్సందేహముగ చెప్పవచ్చును. నన్నయ, నన్నెచోడులయందు బీజప్రాయముగ నుండి మల్లికార్జునపండితులు యథావాక్కుల అన్నమయ్య, పాలకురికి సోమన అను శతకకవిత్రయమువారి యందు సంపూర్ణమైన స్వరూపమును సంతరించుకొనినది శతక ప్రక్రియ. ఈ కవిత్రయము చూపిన రాచబాటలం దితరశతక కర్తలు స్వేచ్ఛావిహార మొనర్చి శతకమును సర్వాంగసుందరమైన సాహిత్యప్రక్రియగా రూపొందించిరి. పురాణయుగము నుండి ఆధునికయుగమువఱకును సాహిత్య సంప్రదాయములు తారుమారగుచున్నను, శతకముమాత్రము స్థిరమైన రూపమున నిలచినది. ప్రాచ్యపాశ్చాత్యసాహిత్యప్రభావ మాంధ్రసాహిత్యమున నూతనములైన కావ్యప్రక్రియలను సృష్టించినను, వాస్తవికత, అతివాస్తవికత మున్నగు సంప్రదాయములు విప్లవాత్మక రూపురేఖలను కల్పించినను శతక ప్రక్రియమాత్రము చెక్కుచెదరక అచ్ఛమైనవ్యక్తిత్వమును నిలుపుకొనుటయే కాక అత్యాధునికయుగధర్మములనుకూడ జీర్ణించుకొని నిత్యనూతనముగ శోభిల్లుచున్నది. ఆంధ్ర శతక వాఙ్మయమును గూర్చి నేను పరిశోధన మొనర్చిన సందర్భము నందనేక నూత్నాంశములు వెలుగునకు వచ్చినవి. శతక వర్గీకరణము, తులనాత్మకపరిశీలనము, రసఛందోలంకార భాషావిశేషములు, రచనా విధానము శతక స్వరూపము, సమకాలిక సాంఘిక జీవన చిత్రణము మున్నగు అంశములనాధారముగ గొని ఆంధ్రశతకవాఙ్మయవైశిష్ట్యమును నిరూపించుటకు తగినసాధన సామగ్రి కలదు. ప్రస్తుతము శతకవర్గీకరణము-తులనాత్మక పరిశీలనము అనురెండు అంశముల నాధారముగ గొని తెలుగుశతకములప్రత్యేకతను నిరూపింతును.

తెలుగుశతకములు భక్తి, శృంగార, నీతి, వైరాగ్య ప్రధానములుగ మాత్రమే అభివృద్ధి నొందినవని సాధారణముగ భావించుట కలదు. ఆంధ్రశతకములను బరిశీలించినచో నవి ఇంకను విస్తృతపరిధిలో వికాసము నొందినట్లు తెలియుచున్నది. తెలుగులో వెలువడిన వేలకొలదిశతకములను వస్తువునను సరించి ఇట్లు వర్గీకరింపవచ్చును.

(1) భక్తి శతకములు (2) నీతిశతకములు (3) అధిక్షేప హాస్యశతకములు-(4)శృంగార శతకములు (4) వైరాగ్య తత్త్వ శతకములు (5) చారిత్రకశతకములు (6) వ్యాజస్తుతిశతకములు (7) కథాత్మకశతకములు (8) అనువాద శతకములు (9) సంకీర్ణ, వివిధవస్తుకశతకములు-ఇందు ఒక్కొక్క వర్గమునందును మరికొన్ని ఉపశాఖలు కలవు అన్నివర్గముల ఉపశాఖల నిట వివరించుట సాధ్యముకాదు. ఒకటి రెండు వర్గముల ఉపశాఖలను మాత్రము వివరింతును.

I భక్తిశతకములు :— (1) శైవభక్తి శతకములు-(2) వైష్ణవభక్తి అవతారస్తుతిశతకములు (3) నానాదేవతా భక్తిశతకములు (4) దేవీభక్తిశతకములు. వివిధభక్తి శతకములలోను కొన్ని ఉపశాఖలు కలవు (అ) గురుపితృమాతృభక్తి శతకములు (ఆ) మతాచార్యస్తుతిశతకములు (ఇ) సిద్ధ, మహాత్మ, మహాపురుష స్తుతిశతకములు (ఈ) ప్రభుమంత్రి, అధికారస్తుతి శతకములు. (ఉ) నదీనద దేశభక్తి శతకములు. మున్నగునవి ప్రధానమైనవి.

II సంకీర్ణ శతకములు:— (1) భాషావ్యాకరణ నిఘంటు ప్రహేళికా శతకములు (2) సమస్యాపూరణ శతకములు (3) ద్వ్యర్థిశతకములు (3) వర్ణనాత్మక శతకములు (4) వివిధ వస్తుకశతకములు మున్నగునవి.

III కథాత్మక శతకములు :—(1) ఇతిహాస, పురాణ కథా ప్రధానములగు శతకములు (2) జీవితకథాత్మక శతకములు (3) ఆత్మకథాత్మక శతకములు.

ఇట్టివర్గీకరణము ననుసరించి శతకవాఙ్మయ వికాసమును గూర్చి వివరించినచో నదియొక బృహద్గ్రంథమగును. సుపరిచితములు కాని కొన్నివర్గములగూర్చియు, నావర్గమునందలి ఉపశాఖలనుగూర్చియు, నందువెలువడిన విశిష్టలక్షణములు గల కొన్ని

శతకములను బరిశీలించినచో నాంధ్రశతకవాఙ్మయపై శిష్ట్యమును సంగ్రహముగ గ్రహింపవచ్చును.

వైష్ణవ శతకములందును, అవతారస్తుతి ప్రధాన శతకములందును, నృసింహ, రామ, కృష్ణావతారములనుగూర్చి తెలుగులో మిక్కుటముగ శతకములు వెలువడినవి. క్షేత్రమహాత్మ్యప్రధానములైన శతకములును, నవవిధభక్తి మార్గములకు బ్రతీకలుగ నుండునట్టివియు నసంఖ్యాకములుగ నున్నవి. కూర్మావతారమునుగూర్చి ఒకటి రెండు శతకములు మాత్రమే లభించినవి. అందు కీ. శే. శ్రీపణతుల లక్ష్మీనృసింహశాస్త్రి "తాబేలుల మేటి రమ్యమృదుపీవర హృత్తటి హేమసత్తటీ'' అనుమకుటమున రచించిన తాబేలుమేటి శతకము ప్రశస్తమైనది,

నానా దేవతాభక్తి శతకములందు శారద, శారదాపతిని గూర్చియు వివిధగ్రహ దేవతలగూర్చియు రచింపబడిన శతకములు ప్రధానముగ గణింప దగినవి. ఝంఝూమారుత సుబ్బకవి రచించిన సూర్యనారాయణశతకము, ఘటికాద్రివిరచిత శనైశ్చర శతకము మున్నగునవి ఈ శాఖలోనివి–గణపతి మారుతిమున్నగు దేవతలగూర్చియు పెక్కుశతకములు వచ్చినవి.

పురాణ గాథలననుసరించి బ్రహ్మకుపూజా పునస్కారములు లేవని తెలియును. నలువను నుతించు మహాభాగ్యమునాడు శారదకును, నేడుశారదాంబకును లభించినది. చతుర్ముఖునిగూర్చి శ్రీమతి జొన్నలగడ్డశారదాంబ రచించిన శారదాపతి శతకము ఈవర్గములో ప్రశస్తమైనది. చదువులకు తల్లియైన సరస్వతీదేవిని శతక రూపమున నారాధించిన వారిలోవెండిగంటము గురునాధకవి ప్రముఖుడు. ఈ కవి రచించిన సరస్వతీశతకము ప్రౌఢముగను రసవంతముగను నున్నది. "క్రిందటియాకు రాలినను గిల్కుల నవ్వుమీదియాకు తానుండెగు కొన్నినాళ్ళ'' కను పద్యమునందు క్షణికమైన జీవితమునుగూర్చి మనోహరముగ జిత్రించెను. అల్లంరాజు లక్ష్మీపతి రచించిన శ్రీవాణీశతకము, భమిడిపాటి రామమూర్తిశారదా శతకము, వక్కలంక శ్రీనివాసరాయకృత శారదాశతకము మున్నగు శతకము లీశాఖకుజెందినవి.

త్రిమూర్తులసతులనుగూర్చియు, గ్రామదేవతలనుగూర్చియు పెక్కుశతకములు వెలువడినవి. అల్లమరాజు నారాయణరావు బులుసువేంకట కవులుకలసి రచించిన వేమగిరికొండలదేవి శతకము, వేమగిరి ముత్యాలమ్మశతకము, అచ్చయకవి ప్రణీతమగు పందిశమ్మశతకము మొదలగునవి ప్రధానముగ గణింపదగినవి.

"మాతృదేవోభవ పితృదేవోభవ'' యను సంప్రదాయ సూక్తిననుసరించి శతకకవులు మాతాపితరులగూర్చి భక్తిశతకములు రచించుట గమనార్హము. అప్పావుమొదలి మాతృశతకము జనార్ధనశాస్త్రి, 'కన్నతల్లి, భీమరాయకృత పితృభక్తి మున్నగునవి ఇట్టివి. మతాచార్య సిద్ధమహాత్మ స్తుతిశతకములు భక్తిశతకములకు వినూత్నాలంకారములు–ఆచార్యబోధిభాస్కరుల బుద్ధశతకము అజ్ఞాతకవికృత రామానుజశతకము, చౌదరి పురుషోత్తకవి ఏసునాయక, ఏసుక్రీస్తు ప్రభుశతకములు, షేక్‌దావూద్‌కవి రసూల్ప్రభుశతకము, త్రిపురాంతకాచార్యుల వీరబ్రహ్మం శతకము, మునుస్వామి పిళ్లై శ్రీహరనాధశతకము, శంకరరెడ్డి కృతమగు నాగబ్రహ్మశతకము, దూపాటి తిరుమలాచార్యులు, సంగెపువీరరాజు మున్నగువారు రచించిన సాయిబాబాశతకములు, సముద్రాల లక్ష్మయ్య రచించిన మలయాళ సద్గురుశతకము, మొదలైనవి ఈశాఖకుజెందిన శతకములందు ప్రశస్తములైనవి. ఇవి అన్నియు స్తుతిప్రధానములుగను, ఆయా తత్త్వ ప్రతిపాదకములుగను రచింపబడినవి.

జార్జి చక్రవర్తి, కృష్ణభూపతి, విక్రమదేవులు, కృష్ణ మహీపతి, రాణీ చెల్లాయమ్మమున్నగు ప్రభువుల గూర్చియు, వేంకట మంత్రి మగటపల్లికామయమున్నగు అధికారులను, ప్రముఖ వ్యక్తులను గూర్చియు శతకములు వెలువడినవి, కొందరు జాతీయనాయక స్తుతి శతకములను రచించిరి, లోకమాన్యతిలకు, మహాత్మగాంధీ, సుభాస్‌చంద్రబోసు వంటి ప్రముఖ జాతీయనాయకుల గూర్చి పలువురు శతకములను రచించిరి. ఇవి స్తుతి ప్రధానముగాను, జాతీయోద్యమ వివరణాత్మకముగాను, దేశభక్తి ప్రబోధకముగాను, రచింపబడినవి. నదీ నద దేశభక్తి ప్రధానములైన శతకము లెన్నియో కలవు.

తత్త్వ శతకములు తెలుగు శతకములలో మకుటాయమానములు. వేదాంత రహస్యములను గూర్చి శాస్త్రపండితులు బృహద్వ్యాఖ్యాన గ్రంథములను రచించియుండిరి. అది పండితులకును, మేధా సంపన్నులకును ఇనుప గుగ్గిళ్ళవంటివి. అతిని గూఢమైన వేదాంత తత్త్వమును, హైందవ వేదాంతము నందలి విభిన్న తత్త్వ రహస్యములను, వివిధ దృక్పథములను, తెలుగు శతక కర్తలు ద్రాక్షా గుళుచ్ఛ ప్రాయముగ సుబోధ మొనర్చిరి. సదానంద, శివముకుంద, సంపగిమన్న. కేవలాత్మ, నిస్సంశయాత్మక, అఖిలరూపాత్మక, మల్లనయోగి, అచలాత్మ, హంస, పంచీకరణ, పెంట, రాజయోగి, క్షరాక్షర విలక్షణ, పరమపద పూర్ణ, పూర్వకర్మ, వట్టిమాయ, సదాచార్య శతకము లీ శాఖకు చెందిన ప్రశస్త శతకములలో కొన్ని మాత్రమే.

శృంగార శతకములలో కొన్ని మాత్రమే విశిష్టములైనవి. గాథాసప్తశతి, అమరుకము, భర్తృహరి శృంగార శతకము, కృష్ణలీలా తరంగిణి, శ్రీకృష్ణ కర్ణామృతము, మేఘ సందేశము, సంస్కృతాంధ్ర ప్రబంధ కావ్యములు మున్నగు వానిని అనుకరించి వెలువడిన శృంగార శతకములు తెలుగునందధికముగ గలవు. రాధాకృష్ణుల ప్రణయము ననుసరించి రచింపబడిన శతకములలో పుసులూరి సోమరాజ కవి రచించిన ఇందూ శతకము, నందనందన శతకము ప్రశస్తములైనవి. తదితర శృంగార శతకములలో హేలాపురి, లావణ్య, బ్రహ్మనంద, కీరవాణి, మదనగోపాల, శ్రీరంగేశ, మోహినీ, తాడిమళ్ల రాజగోపాల, మురుముళ్ళ వీర శంకర, రాజలింగ శతకములు ప్రధానముగ బరిశీలింపదగినవి. సంయోగ వియోగ శృంగారము నత్యుదాత్తముగ చిత్రించిన శతక కర్తలును, అశ్లీల వర్ణనలొనర్చిన శతకకవులును గలరు. స్వచ్ఛ

మైన ప్రణయమునత్యుదాత్తముగ జిత్రించినవారును కొందరు కలరు. అశ్లీలోక్తులతో పూర్ణమైన సరసోక్తియుక్త కృష్ణ శతకము వంటి శతకములును కొన్ని కలవు.

నీతి, అధిక్షేప, హాస్యశతకములు, ప్రభు సుహృత్కాంతా సమితమ్మనులుగ గన్పట్టుచున్నవి. ప్రభు, అమాత్య, అధికార వర్గములకు సంబంధించిన రాజనీతియు, ప్రజాసామ్య ప్రభుత్వమునకు సంబంధించిన రాజనీతి విశేషములన్నియు నీతి శాస్త్రముక్తావళి, నీతి సీస పద్యశతకము, వోటరు భాయీ శతకము మున్నగు వానిలో చక్కగా వివరింప బడినవి. చీపురుపుల్ల, విసనకర్ర, పకోడి, పొగచుట్ట, సోడాబుడ్డి శతకములందు సామాన్య వస్తువు కావ్యవస్తువుగా గౌరవింపబడినది. ఈ శతకములు హాస్య ప్రధానములు కౌటిల్యుని రాజనీతి విశేషములను, భర్తృహరి మున్నగు సంస్కృత కవుల సూక్తులలోని సారాంశమును శతకకర్తలు తమకు గల లోకానుభవముతో రంగరించి, సమకాలిక పరిస్థితులకను గుణముగను, మానవుల చిత్తవృత్తుల కనుగుణముగను, వివిధ నీతులను సూటిగను, మాటుగను, అన్యాపదేశముగను, దృష్టాంత పూర్వకములుగను, చక్కని పదబంధములు, జాతీయములతోడను ఉపదేశించిరి. బద్దెనమున్నగువారు వేసినపునాదులపై కవిచౌడప్ప, అడిదము సూరకవి, వేమన, మున్నగువారు మహాసౌధమును నిర్మింప, గురజాడ, విశ్వనాథ, శ్రీశ్రీ, నార్ల, దాశరధి, కొండవీటి కవి మున్నగువారు ఆకాశమును చుంబించు అంతస్తులను జేర్చిరి. ఈ మహాసౌధమునకు వన్నె చిన్నెలు కూర్చుటకు శతక కర్తలెందరో కృషి యొనర్చిరి

తెలుగులో వెలువడిన చారిత్రక శతకములలో కొన్ని వాజనిందాస్తుతి ప్రధానములు—ఆంధ్రనాయక, సింహాద్రినారసింహ, భద్రగిరి, వేంకటాచలరమణ, శతకము లిట్టివి రొంపిచెర్ల కృష్ణమాచార్యులు రచించిన విప్లవాత్మక కాత్యాయనీ శతకములు ప్రధానముగ బరిశీలింపదగినవి. ద్వితీయప్రపంచ సంగ్రామానంతర పరిస్థితులను సమీక్షించి, గీర్వాణ సంస్కృతీ నిలయమగు భారతదేశము క్రైస్తవ మతాధికారులకును, నాంగ్లేయులకును ప్రధాన కేంద్రముగ నేర్పడిన ఉదంతమును, భారతదేశముపై ద్వితీయ ప్రపంచ సంగ్రామ ప్రభావ పరిణామములను, వంగ, ఆంధ్ర ప్రాంతములందు క్షామదేవత నగ్నతాండవ మొనర్చిన దుర్భర పరిస్థితులను, కవి శతకమునందు వివరించెను. జాతీయసంస్థయగు కాంగ్రెసు నిర్వహించిన జాతీయోద్యమము, భారతదేశ రాజకీయ పరిస్థితులు—భారతీయుల స్వాతంత్ర్యోద్యమము—ఆంగ్లేయులు, భారతీయులకు స్వాతంత్ర్యమునొసగిన వృత్తాంతము, దేశవిభజనము, తదనంతర మత రాజకీయ సంఘటనలు, వివిధ సంస్థానముల విలీనీకరణము—హైదరాబాదు సంస్థానరాజకీయములు మున్నగు చారిత్రకాంశములెన్నియో ఈ శతకమున వివరింపబడినవి.

శతకము సంఖ్యానియతి గల ముక్తక సముచ్చయము. ఏ పద్యమున కాపద్యము స్వతంత్రమైన అర్థమునుగలిగి యుండును. తొలిదశయందు వెలువడిన శతకములన్నియు నిట్టి లక్షణము కలవియే. అనంతరయుగములందు తద్భిన్నముగ కథాసూత్ర బద్ధమైన శతకములు కొన్ని వెలువడినవి. ఇతిహాసపురాణ కథాత్మకములుగను, జీవిత కథాత్మకములుగను, ఆత్మకథాత్మకములుగను, కొన్ని శతకము లాంధ్రమున వచ్చినవి. ఇవి ఆంధ్ర శతక వాఙ్మయమునకు నూత్న మార్గమును జూపినవి జూలూరి అప్పయ్య కృతమగు ముకుంద రాఘవశతకము, వంగూరి ముద్దు నరసకవి ప్రసన్నరాఘవ శతకము, మంగిపూడి వీరయ్య సిద్ధాంతి రామాయణ సంగ్రహము, చినశ్రీరాముల సంక్షేపరామాయణము మున్నగునవి రామాయణ కథాత్మక శతకములలో ముఖ్యముగా పరిశీలింపదగినవి. ఇందుకొన్ని వాల్మీకి రామాయణము నాధారముగ రచింపబడినవి. మరి కొన్ని తదితర రామాయణము లందలి కథల నాధారముగ స్వీకరించినవి. తుర్లపాటి పురుషోత్తమ శర్మ భాగవత ప్రథమస్కంధ శతకమును, భాగవత దశమస్కంధమును రచించెను. చెన్నమల్లయార్యుని మార్తాండ శతకమునందు సూర్యుని వైవాహికోదంతము, తూములూరి వేంకటరంగ కవి మీనాక్షీ శతకమునందు మీనాక్షీ సుందరేశ్వరుల వివాహవృత్తాంతము రమణీయముగ జిత్రింపబడినది. స్కాందపురాణాంతర్గతమగు నాగరోజ్జ్వల ఖండము నాధారముగగొని నారయశాస్త్రి విశ్వకర్మ శతకమునందు విశ్వకర్మ చరితము నుల్లేఖించెను. ఆత్మకథాత్మక శతకములందు అభినవాంధ్ర కవితాపితామహ బిరుదాంచితులగు మండపాకపార్వతీశ్వర శాస్త్రి హరిహరేశ్వర శతకము విశిష్టాతివిశిష్టమైనది. దినచర్యారూపము నందాత్మకథా కావ్యరచనకును, కవుల ఆత్మకథా రచనకును, ఇది వేగుచుక్కగా నిలుచునట్టిది. హరిహరేశ్వర శతకమితరాంశములననుసరించియు నుదాత్తమైనది కొక్కొండ వేంకటరత్న కవి బిల్వేశ్వరీయము రత్నమువంటి ఆత్మకథాకావ్యము. తిరుపతి కవుల ఆరోగ్య కామేశ్వరీ, ఆరోగ్యభాస్కర, మృత్యుంజయ శతకములు. వద్ది తాతయ్య కోనాలవేణు గోపాల శతకము, చిదంబరశాస్త్రి దారుణశతకము, వావిలికొలను సుబ్బారాయ కృత టెంకాయచిప్ప శతకము, గరికపాటి మల్లావధాని భారతాంబికా శతకము మున్నగునవి ఆయాకవుల జీవితములలోని ప్రధాన సంఘటనలకు ప్రతిబింబములు.

భారతీయ భాషలలో నేభాషయందును సహస్రాధిక సంఖ్యలో శతకములు వెలువడలేదు. శతకము నింతగా నాదరించి పరిపుష్టమొనర్చిన కీర్తిగౌరవములు తెలుగు కవులకు లభించినవి. ప్రాకృతమునందు తారాదేవియు నవలోకితేశ్వరులగూర్చియు, నితరాంశములను గూర్చియు వెలువడిన శతకములు వ్రేళ్ళపై లెక్కింప దగినవిగానున్నవి. ప్రాకృతమున నందవదాన శతకములును. సంస్కృతమునందు విశిష్టములైన శతకములును వెలువడిన మాట నిజమే కాని వస్తువైలక్షణ్యము గల శతకము లందును గన్పట్టవు. తమిళమునందును కన్నడమునందును భక్తి నీతి ప్రధానములగు శతకములే అధికముగ రచింపబడినవి, అవియు కొని మాత్రమే. మహారాష్ట్రము, హిందీ శతకముల విషయమంతియ. ఇట్టి తులనాత్మకపరిశీలనము వలన ఆంధ్ర శతకవాఙ్మయము విశిష్టమైనదని సగర్వముగ చెప్పవచ్చును.

# భాగ్యచక్రం

ఆరికెపూడి కౌసల్యాదేవి

''ఏమిటి నాన్నా అది?'' అంటూ దగ్గఱగా వెళ్ళి చూచింది జయశ్రీ శ్రీనగేష్ కూడ విమర్శనా పూర్వకంగా చూచాడు. యాంత్రిక సంబంధమైన వ్యాసాలూ, బొమ్మలూ వున్న పుస్తకం అది, ఆపుస్తకంలోవున్న కారూ, రైలూ, విమానం బొమ్మలను కోపంగా కసిగా చింపి పారేస్తున్నాడు శ్రీపతి శ్రీనగేష్‌ను చూచి, చూడవయ్యా చూడు మారణాయుధాల కంటె అధికంగా మట్టుపెట్టి మసిచేస్తాయి మనుష్యులను, ఈవెధవ వాహనాలు వీటినిగురించి పెద్ద గొప్పగా పుస్తకాలు అచ్చువేసి ప్రచారం చేస్తారా, ప్రచారం? మూర్ఖులు! అజ్ఞానులు!''

ఎంతకూ కోపం తగ్గక ఆపుస్తకాన్ని ఇంకా కాళ్ళక్రింద పడవేసి నలిపివేయసాగాడు.

''నిన్న డక్టర్ శ్రీకాంత్‌తో పాటు అతడి స్నేహితుడెవరో బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసర్ వచ్చాడిక్కడికి, అతడి పుస్తకం యిక్కడ మరచిపోయి వెళ్ళినట్లున్నాడు!'' అని చెప్పింది జయశ్రీ మెల్లగా.

''అదా సంగతి!'' అంటూనే నగేష్, ''పోనీలెండి, మనకెందుకా పుస్తకం గొడవ? కాసేపు సరదాగా మాట్లాడుకుందాం, కూర్చోండి'' అన్నాడు శ్రీపతితో.

అనుభవజ్ఞుడైన నర్సు చంద్రం త్వరగా ఆ పుస్తకం కాగితాలు తీసి దాచేశాడు శ్రీపతి ఎవరితోనూ మాట్లాడలేదు. పోయి కిటికీ దగ్గఱ అన్యమనస్కంగా నిల్చున్నాడు.

''రాత్రి చాలాగొడవ చేశారు, నాన్న. మీ ఇంటికి కబురంపితే నువ్వింకా రానేలేదని తెలిసింది''. అన్నది జయశ్రీ ఏదో నేరమారోపించు తూన్నట్లు.

''ఏం? ఏ కారణంగా గొడవ జరిగింది?'' శ్రీ నగేష్ ప్రశ్న

''డాక్టర్ శ్రీకాంత్, అతని స్నేహితుడూ ఆ స్నేహితుని కారులో ఈ దారిన వెళ్తూ ఓ సారి చూచిపోదామని ఇక్కడ దిగి లోపలికి వచ్చారు ఆ కారు హారన్ వింటూనే మామూలు గొడవ ప్రారంభించేశారు నాన్నగారు.''

## జరిగిన కథ

వైద్య విద్యా పట్టభద్రుడయిన శ్రీనగేష్ సేవాతత్పరత అతని మామ శ్రీపతికి నచ్చదు. శ్రీపతి కుమారుకు శ్రీహరి వివాహం. సమయానికి పట్నం అందని కారణంగా ఆగి పోతుంది తిరిగి వస్తూండగా కారు ప్రమాదంలో చిక్కుకొని శ్రీపతి గారికి మతిస్థిమితం తప్పుతుంది శ్రీనగేష్ గ్రామంలో పెట్టిన ఆసుపత్రి-భాగ్యచక్రం చాలా అభివృద్ధి చెందుతుంది, దానిని చూచేందుకు శ్రీలక్ష్మి రాగా ఆమెకు తన ఆసుపత్రి పెట్టుటకు దారి తీసిన సంఘటనలను శ్రీనగేష్ తెలియజేస్తాడు. శ్రీలక్ష్మి తిరిగి వెళ్ళిపోతుంది. తరువాత శ్రీపతి యింటికి వెళతాడు శ్రీనగేష్ శ్రీపతిని, జయశ్రీని తనయింటికి ఆహ్వానిస్తాడు శ్రీపతి, జయశ్రీ యిద్దరు "భాగ్యచక్రం" ను తిలకించి, నగేష్ ఇంటికి పోయి మర్యాదలుపొంది తిరిగి ఇంటికి వెళ్ళుతారు శ్రీనగేష్, జయశ్రీ. శ్రీదేవి షాపింగ్‌కు పట్నంవెళ్తారు. అక్కడ లక్ష్మి కనబడుతుంది

---

వింటూనే చాలా ఆగ్రహ పరవశుడయ్యాడు శ్రీ నగేష్. ''ఒకవేళ ఏ కారణానైనా గొడవ ప్రారంభించితే వచ్చి చూడమని చెప్పినందుకు పని గట్టుకువచ్చి లేని గొడవను తెచ్చి ప్రశాంతతను పాడుజేశాడన్నమాట! ఏమిటతడి ఉద్దేశ్యం?'' తనలోతాను అనుకున్నట్లుగా అన్నాడు పాపం ఆయన తప్పేముంది లెండి, ఓ సారి ఎలా ఉన్నావో చూచిపోదామని వచ్చారు!"

మధ్యన శ్రీ కాంత్‌ను ఆమెవెనకేసుకు రావడం శ్రీ నగేష్‌కు ఆశ్చర్యం కలిగించింది. వెంటనే సంభాషణ మార్చేశాడు, ''అయితే ఈ గొడవయ్యాక, తెల్లవారి మామూలుగానే నిద్రలేచారా?"

''ఆ మరేం విశేషం లేదు"

ఉఁ...ఇప్పుడు నేను తెచ్చిన నర్సు చాలా క్వాలిఫైడ్, ఇక నీకు యిటువంటి ఆందోళనా, శ్రమా లేకుండా రాత్రింబవళ్ళు జాగ్రత్తగా చూచుకుంటాడు. నెలకొకసారి మాత్రం పోయి పట్నంలో రెండు రోజులుండి తన కుటుంబాన్ని చూచుకువస్తాడు. అంతే, అతడికిక్కడే భోజన సౌకర్యం కల్పించి నెలకు ముప్పైయియ్యి, చాలు... ...అంగీకారమేనా?"

అలాగే, అటువంటివన్నినాకే తెల్సుగా? ఇక నేను కాదనేదేమున్నది? రాత్రి నిజంగా చాలా అధైర్యపడి పోయాను.''

అదేవద్దుజయా, ఏ పరిస్థితులలోనైనా ధైర్యంగా వుండడం నేర్చుకో" అంటూండగానే శ్రీపతి వచ్చి వారిదగ్గఱ కూర్చున్నాడు

ఏమిటీ? ఏమిటంటారు? ఇతడెవరు?" అని ప్రశ్నించాడు శ్రీ నగేష్‌ను చంద్రం వైపుచూస్తూ

అతడు మంచివాడండి. పేరు చంద్రం. మిమ్మల్ని ప్రత్యేకంగా కనిపెట్టుకొని వుండడానికి ఏర్పాటు చేశాను.''

శ్రీపతి కనుబొమలు ముడివడ్డాయి. "ఎందుకయ్యా, అస్తమానం నా ఆరోగ్యం గురించి అడుగుతావు: నన్నొకడు కనిపెట్టి వుండాలంటావు. ఏమిటిదంతా ? నీకేంమతిగానీ పోలేదు కదా ?"

పస్తి మతిమాలిన వాడినోటినుండీ వచ్చే ఆ మాటకు డాక్టర్ చలించలేదు. అయిదు నిముషాలపాటు అలా రెప్ప వేయకుండా చూచాడు శ్రీపతిని. "మతిపోవడమంటే ఏమిటండీ ? దేనినంటారు అలాగ ?'' అని ప్రశ్నించాడు సూటిగా.

రెండు నిముషాలపాటు ఆలోచించాడు. "ఏమో ? డాక్టరువు నీకే తెలియాలి. అయినా ఏమిటీ చొప్పదంటు ప్రశ్నలు ? ఇంతకీ యితడెవరని అడుగుతున్నాను ? ఎందుకితడు ?" కొంచం కఠినంగానే అడిగాడు.

ఈ లోగానే చక్కటి సమాధానం ఆలోచించి అట్టేపెట్టుకున్నాడు శ్రీ నగేష్. ''అమ్మాయి గారికి ఆరోగ్యం బాగుండడం లేదండి. అంచేతపైకీ, క్రిందికీ తిరిగి మీ పనులు చూడలేక, అందుకొక మనిషిని ఏర్పాటు చేయమని నాకు చెప్పారు. ఈ పల్లెటూరి పాలెళ్ళకేం తెల్సు. మిమ్మల్ని ఎలా చూచుకోవాలో ? అందుకు మంచి మనిషిని తీసుకొచ్చాను."



ఈ చతురమైన జవాబు శ్రీపతి మనసుకు నచ్చింది. నమ్మకం కుదిరింది.

"ఏమమ్మా ? నీ వంట్లో బాగుండలేదని నాకుచెప్పలేదేం. మంచి మందివ్వండి డాక్టర్ ! అమ్మాయికి, తగ్గిపోతుంది త్వరగా. అన్నట్లు ఇలా అమ్మాయికి అనారోగ్యంగా వుందని వ్రాస్తే వాళ్ళమ్మ త్వరగా వచ్చేస్తుంది. వ్రాస్తాను ఇప్పుడే వ్రాస్తాను.''

''వ్రాయొచ్చులెండి, తొందరేం ? పెద్దనెక్కువ జబ్బేమీ కాదు. మరి నాకు సెలవిప్పించండి.''

''ఆఁ ఆఁ, వెళ్ళిరా, నేనూ ఉత్తరం వ్రాసుకోవాలి."

''చంద్రం, జాగ్రత్త ! చాలా బాధ్యతగా వుండాలి !' నర్సును హెచ్చరించి బయటకు నడిచాడు శ్రీ నగేష్.

అప్పటికే జయశ్రీ మేడదిగి వెళ్ళిపోయి. క్రింది గదిలో ఉదాసీనంగా కూర్చొని వున్నది.

''ఏమిటి జయా అలా వున్నావ్ ఈవేళ ?'' అని అడుగుతూ ఆమెకు దగ్గరలోనే కూర్చున్నాడు ఒక కుర్చీలో.

జయనుండి జవాబు లేదు.

''అంతా పాత ధోరణిలోనే వున్నదే ? నిన్నకొని తెచ్చినవి ఏంచశావ్ మరి ?" అనడిగాడు.

"ఇంకా విప్పలేదు. అలాగే పడివున్నాయి." అన్నది పూర్వపు ఉదాసీనతతోనే.

కొద్ది క్షణాలు చూచి అడిగాడు :" ఏం, ఒంట్లో బాగుందా ?" 'ఔ' నన్నట్లు తలాడించిందామె.

ఈ మూగనోము ఏమిటో అర్థంగాక చూస్తూన్న అతడిని హఠాత్తుగా అడిగింది జయశ్రీ : ''అయితే బావా ! నువ్వింతటి వాడవని నేనెప్పుడు అనుకోలేదే !''

"ఏమిటీ నిందారోపణ ?''

''అవును మరి ! నీకు నన్నుకాస్త అవసరార్థం పట్నం బజారుకు తీసుకు వెళ్ళాలంటే చాలా అనుమానాలు, అభ్యంతరాలూ ఎదురయ్యాయి. మరి నిన్న ఆ లక్ష్మితో ఒక్కడవూ కారులో బస్తీ వీధులన్నీ తిరగడానికేమీ అభ్యంతరం లేకపోయిందా ?''

అప్పుడర్థమైంది శ్రీనగేష్‌కు ఆమె అన్యమనస్కతకూ ఉదాసీనతకూ అసలు కారణం, అలాగేమౌనంగా ఆమె మాటలకై ఎదురు చూడసాగాడు, సమాధాన మీయకుండా.

"అయితే, ఆ లక్ష్మి ఏమన్నది ? నీకెక్కడ కలిసింది వక్కడి నుంచి ?" ఏదో అధికారమున్నట్లే ప్రశ్నించింది.

జయశ్రీ అనవసర కుతూహల ప్రదర్శనకు ఆశ్చర్యంతో పాటు అసహ్యం కూడా కలిగింది శ్రీ నగేష్‌కు. "నేను రాత్రే వచ్చేశాను, చాలా ప్రొద్దుపోయింది. నర్సును మాట్లాడి తీసుకొచ్చేసరికి, మళ్ళీ ఊళ్ళో కొచ్చేసరికి యిక్కడో టైఫాయిడ్ రోగి

తయారు. ఇంకా యింటికికూడా వెళ్ళలేదు నిన్నటినుంచి. ఒక్క సారి చూచిపోదామని, ఇప్పుడు యింటికి పోతూ యిలావచ్చాను."

ఆ మాటలు పట్టించుకున్నట్లే లేదు జయశ్రీ. "నువ్వు ఎప్పటికప్పుడు నన్ను అవమానిస్తున్నావు!" అంది హఠాత్తుగా.

అయోమయంగా చూచాడు శ్రీ నగేష్

"ఆ లక్ష్మి ఏమనుకుంటుందోననే భయంతో ఆమె యింటికి వెళ్ళావుకాని, నన్ను వదలి వెళ్ళిపోతే నేనేమనుకుంటానో నని నీకన్పించలేదా?"

"అదేమిటి? నిర్ఘాంతపోయాడు నిజంగా నగేష్. "నా కింకా హాస్పిటల్‌లో పని వున్నమూలాన వుండిపోయానే కాని శ్రీలక్ష్మిగారికోసం, మరొకరికోసం ఎందుకుండిపోతాను? అదీకాక నిన్నొక్కర్తెనూ వదిలేశానా? నీకోసమేగా మా అమ్మ వచ్చింది? నీతోనే తిరిగి వచ్చింది! ఇక నాప్రమేయమేమున్నది? నేను నిన్ను అవమానించిందేముంది ఇందులో?"

ఈ సారి జయశ్రీ కోపానికి క్రొత్తమేత దొరికింది. "అయితే బావా, ఆ పిల్లవాడెవరు?" నిప్పులు కురిపిస్తున్న నేత్రాలతో ప్రశ్నించింది. "వాడికోసం వచ్చింది మీ అమ్మ. నాకోస మెందుకొస్తుంది? నా వాళ్ళంతా చచ్చి నేనెన్నో బాధలలో ఉన్ననాడే రాలేదు మీ అమ్మ.........అయితే నీకు పెళ్ళవడం, ఒక కొడుకు పుట్టడం–ఇవన్నీ ఎప్పుడు జరిగాయి? నాకెందుకు చెప్పలేదు?"

సిళితంగా చూస్తూ నిదానంగా అన్నాడు. "ఆ అభాగ్యుడికి నేను తండ్రిని. అయితే నీకిందులో అంతకోపం రావలసిన అవసరమేమిటి?"

"ఈ విషయాలెందుకు దాచిపెట్టి, నాలో ఆశలు రేకెత్తించావని నాప్రశ్న?" అంటూన్న ఆమె కనులనుండి జలపాతాలు ప్రవహించసాగాయి.

"ఎవరి జీవిత రహస్యాలనూ ఎవరితోనూ చెప్పవలసిన అవసరంలేదు జయా. నా వృత్తికి అవసరమైనంత వరకే నేను యితరుల విషయాలు తెలుసుకుంటాను. అంతేకాని నాకు యితరుల వ్యక్తిగత విషయాలతో ప్రమేయమూ, ఆసక్తీ వుండవు. అలాగే యితరులకూ వుండవు–కనీసం వుండరాదని నా భావం."

"నువ్వెప్పుడూ మాటలు నేర్చిన వాడవే!" నిండా నీళ్ళు నిండిన కండ్లను పైకెత్తుతూ రోషంగా అన్నది జయశ్రీ.

'హుం! అది కేవలం నీ అపోహ. నాకు ఒక పెళ్ళికాదు; ఇద్దరు భార్యలు చచ్చిపోయారు. అయితే అది అంత ఆనందంగా అందరికీ వెల్లడించుకోవలసిన విషయమని నేననుకోలేదు.. ... ఇక నువ్వు ఆశలు పెంచుకోవటమనేది ఎందుకు జరిగిందో నాకు తెలియదు. అది కేవలం నీ తెలివి తక్కువ అని అనుకోవాలి. ఈ విషయం అసలు నేను మాట్లాడవలసి రావడమే నాకు సిగ్గుగా వున్నది. అసలు నాకే యిక ఏ ఆశలూ లేనిది నేను నీలో ఏం ఆశలు రేకెత్తిస్తాను?"

కన్నీటి వరదలలో మునిగి తేలుతూన్న జయశ్రీ సమాధానం చెప్పలేదు.

తిరిగి శ్రీ నగేష్ అన్నాడు: 'భాగ్యచక్రం' నిర్మాణానికి ముందే మన అనుబంధం అణగిపోయింది. నువ్వు నన్నూ నా ఆదర్శాన్నీ అలుసుచేసి, తృణీకరించావు. మన మిద్దరం మాట్లాడుకొనే ఒక నిర్ణయానికొచ్చాం; ఆ క్షణంనుండే నీదారి నీదీ, నాదారి నాదీ అయ్యింది. ఇక నువ్వీనాడు నాపై ఆశలు పెంచుకున్నానని అంటూంటే అందులో నీ అవివేకమే కాని నా మోసమేమీ కన్పించడంలేదు నాకు!"

జయశ్రీ బదులు పలుకకపోయినప్పటికీ ఆమె కోపతాపాలు, బరువైన ఆమె నిట్టూర్పులోనే తెలుస్తున్నాయి

శ్రీ నగేష్ అనునయ స్వరంతో అన్నాడు: "పోనీలే జయా, మనస్సు బలహీనమైనది, ఒక్కొక్కసారి మనకు తెలియకుండానే మనను వశపరుచుకొని ఆడింపజూస్తుంది. మనం కొంచం వివేకంగా ఆలోచిస్తుంటే సరిపోతుంది; అంతే. జరిగింది మరచిపోదాం. మనస్సు తేలికపరచుకో. నేను ప్రస్తుతం మీ నాన్నగారికి డాక్టర్ని. అంతే. అంతకంటే నా గురించి ఎక్కువగా ఆలోచించకు.........నీ మనస్సుకు నచ్చే యోగ్యుడిని వెతకే బాధ్యత నాది. తొందరపడకు."

"చాలా సంతోషం కానీ, నీకా శ్రమేమీ అక్కర్లేదులే" ఒక్కసారిగా ఖంగుమన్నది జయశ్రీ కంఠం. మరుక్షణంలోనే మెరుపులాగా మాయమైంది, అతడి సమక్షంనుండి.

ఆమె వెళ్ళిన దిక్కే ఒక్కసారి నిస్సహాయంగా చూచి, గృహోన్ముఖుడయ్యాడు శ్రీ నగేష్ (సశేషం)

---

# పదిహేనేళ్ల ప్రగతి

గడచిన 15 సంవత్సరాల కాలంలో అంటే ప్రథమ, ద్వితీయ, తృతీయ పంచవర్ష ప్రణాళికలు అమలుజరిగిన కాలంలో దేశం మొత్తంమీద వివిధ రంగాలలో చెప్పుకోదగిన అభివృద్ధి సాధించబడింది ఈ కాలంలో వ్యవసాయోత్పత్తి 62 శాతం పెరిగింది. పారిశ్రామికోత్పత్తి సుమారు 150 శాతం పెరిగింది. 2 కోట్ల 80 లక్షల ఉద్యోగాలు కొత్తగా కల్పించబడినవి

**జరిగిన కథ**

పార్థసారథికి నాటకాలపిచ్చి. ఆ నాటకాలల్లోపడి రాత్రి ఆలస్యంగా కూడ ఇంటికి వచ్చేవాడు ఆ విషయమై భార్యా భర్తలమధ్య పొరపొచ్చాలు వస్తూండేవి రాఘవ నాట్యకళామండలిద్వారా పార్థసారథి నాటకాలు వేస్తుంటాడు ప్రస్తుతం కృష్ణతులాభారం రిహార్సలు జరుగుతున్నవి. సరోజ అనే ఆమె కూడా అందులో ఒక పాత్రధారిణి సరదాకు సరోజ పార్థసారథి వద్ద సంగీతం నేర్చుకోనని రాఘవ అనే మరొకతనివద్ద నేర్చుకుంటానని అన్నది. సరోజ విద్యాభివృద్ధికై తాను చేసిన ప్రయత్నాలను, సరోజ వాళ్ళ ఆర్థిక పరిస్థితులను పార్థసారథి జ్ఞాపకం చేసుకుంటాడు. సరోజ, తన చెల్లెలు పుట్టిన రోజు పండుగ సందర్భంగా పార్థసారథి భార్యను ఆహ్వానించడానికి ఆయన ఇంటికి వెళ్తుంది. కృష్ణమూర్తి వివాహానికి రమ్మని పార్థసారథి, విజయలక్ష్మికి ఆహ్వానం వచ్చింది విజయలక్ష్మి ఒక్కతే పుట్టింటికి వెళ్తుంది.

# గృహిణి

**పిలకా గణపతి శాస్త్రి**

మొత్తం మీద రాఘవ కూడా మొదటి రెండు అంకాలలో కన్న మూడో అంకంలోనే ఎక్కువగా ప్రేక్షకులనురూంజింపగలిగించాడు, కాని ఎందుచేతనో గాని ఆవేళ అతని అభినయంకన్న పాటలే, పద్యాలే అత్యధికంగా సహృదయుల పొగడ్తలందుకున్నాయి

'సర్వేశ్వరుండగు శౌరికింకరుజేయు
ధనమున్నదే భక్తిధనముగాక ।
సర్వోపగతుడైన చక్రిబంధించెడు
బలమున్నదే భక్తిబలముగాక ।

"అన్న సీస పద్యం వారి హృదయాలలో మంద్రమధురంగా గంభీరంగా మారుమ్రోగింది.

"బలేమంచి చౌకబేరము
సుజనులారా ! త్వరగొనుడు ।
బలేమంచి చౌకబేరము ।'

అన్నపాట కూడ సదస్యులందరి నోట అప్రయత్నంగా ప్రతిధ్వనించింది. ఇక నటీనటులందరు ఆనాటి ప్రదర్శనం పోనుపోను క్రమక్రమంగా రక్తి కట్టినదని సంతృప్తిపడి సంతోషించారు,

నాటకం పూర్తికాగానే హాలుహాలంతా ప్రశంసలతో కరతాళ ధ్వనులతో ఘోరుమని మారుమ్రోగింది. నటీనటులకు సుపరిచితులైన ప్రేక్షకులు కొందరు రంగస్థలంలోపలకి వెళ్లి తమ సంతృప్తి వెల్లడించి అభినందించారు. మరికొంత సేపటికి హాలంతా బాగా పలచబడింది మిగిలిన ప్రేక్షకులు కూడా క్రమ క్రమంగా తమ ఇళ్లవైపు వెళ్లిపోయారు

అప్పటికి ఇంచుమించుగా రాత్రి రెండున్నరకావచ్చింది. సరోజ, పార్థసారథి, రాఘవ, రుక్మిణి, వేషంవేసిన జానకి తప్ప మిగిలిన నటీనటులందరు గుర్రపు బళ్లమీద తమతమ ఇళ్లకు వెళ్లిపోయారు. ఆపైన ఆ నలుగురు కూడా అదే ప్రయత్నంలో పడ్డారు. మరికొంత సేపటికి జానకిని ఇంటికి తీసుకువెళ్లడానికని ఒక గుర్రపు బండివచ్చి హాలుగుమ్మంముందు ఆగింది. ఆమె ఆబండిలో కూర్చోడానికి కొంచెంసేపు తటపటాయించి, సరోజతో పార్థసారథితో ఉప్పొంగుతున్న ఉల్లాసంతో సంభాషణ కొనసాగిస్తున్నరాఘవదగ్గరకి వెళ్లి ఎంతో దీనంగా ముఖంపెట్టి బుంగమూతి బిగించింది

నేనొక్కతిని వెళ్ళలేనండి! భయంగాఉంది!,

రాఘవ ఆమె అభిప్రాయం కనిపెట్టి రవంతసేపాగి ఆవలించాడు.

'ఆఁ భయమేముంది! ఇంకా నాటకంజనం రోడ్డుమీద నడుస్తూనే ఉన్నారుగా !

'ఏమోబాబూ ! నాకుభయంవేస్తూంది ! ఎవళ్లైనా అల్లరిచేస్తారేమోనండీ !

జానకి ఎంతో గోముగాగునిసింది.

'పోనీ, పాపం ఒంటరిగా వెళ్లడానికి భయపడుతూందేమో! కాస్త ఇంటిదాకే వెళ్లిదిగబెట్టిరండి !'

సరోజ రాఘవకేసి చూసి బ్రతిమాలుకుంటున్న స్వరంతో ఆజ్ఞాపించింది. అతడిక కాదనలేకపోయాడు. జానకితోబాటు ఆ బండిలో కూర్చోగానే చమ్కీ విదిలింపుతో గుర్రం ఒక్కదౌడు తీసింది ఇకసరోజ, పార్థసారథి ఇద్దరేమిగిలారు మరికొన్ని నిమిషాలలోనే వారిద్దరి కోసము వేర్వేరుగా రెండుగుర్రపు బళ్లు వచ్చి నిలబడ్డాయి.

సరోజ బండిలో ఎక్కి కూర్చున్నంతవరకు పక్కనే నిలుచున్న పార్థసారథి ఆమెతోచెప్పి తనబండివైపు వెళ్లబోయాడు అంతలోనే ఆమెచక్కని చిరునవ్వు చిందించి బ్రతిమాలుకుంది,

'ఏమండీ! నన్ను కూడా కాస్త మాఇంటిదగ్గర దిగబెట్టండీ! అంతతొందరగాఉంటే ఆ తరువాత వెళ్ళిపోదురుగానిలెండి!'

పార్థసారథి ఆ ప్రార్థనకోసమే ఎంతో ఆత్రంగా ఎదురు చూశాడు రెండుమూడు క్షణాలపాటు ఏదోఆలోచిస్తున్నట్టు, తటపటాయిస్తున్నట్టు నటించాడు. ఆ పైన రెండోబండి వాడికి పూర్తిగా కిరాయి ఇచ్చివేసి నెమ్మదిగా అ బండిలోఎక్కి సరోజపక్కన కూర్చున్నాడు

'త్వరగా పోనీయవోయ్! రంగనాయకమ్మగారి ఇల్లెరుగుదువా!' జట్కాబండి తోలుతున్న ఆసామిని ఉద్దేశించి అడిగాడు

'ఆరె ఇల్లే ఎరగ నేటి, అదేటిబాబూ అలాగంటారు!'

బండి అతి త్వరితంగాముమ్ముందుకు దూసుకుపోయింది! దానిలో కూర్చున్న సరోజా, పార్థసారథులిద్దరు ఆనాటినాటక ప్రదర్శనాన్ని గురించి ఆయాఘట్టాలలో ప్రేక్షకుల అభినందనాలను గురించి ఎంతో ఉల్లాసంగా ముచ్చటించుకోవడం మొదలుపెట్టారు. ఆ సంభాషణలో ఆ నాటినాటకాన్ని గురించి అనేక విషయాలు దొర్లిపోయాయి'

'ఈ వేళ మా అందరికన్న మీరే చాలా గొప్పగా నటించారు!'

సరోజ అతనిని అభినందించింది

'ఏమో! నామట్టుకి నాకు నువ్వే మా అందరికన్నా చాలా చక్కగా ఒప్పించావని అనిపించింది. అచ్చంగా ముమ్మూర్తులా సత్యభామలాగే ఉన్నావు, ఈ వేళ ఎవరి నోట విన్నా ఇదే మాట!'

నిజంగానేనా? ఊరికే వేళాకోళాని కంటున్నారా?

నిజమే సరోజా! ఇలాంటి వ్యవహారాలలో నీతో వేళాకోళం ఆడుతానా? నామాట మీకనమ్మకం లేకపోతే రేపు పొద్దున్న ఎవరినయిన పిలచి అడుగు!

'నేను చచ్చిపోయినంత ఒట్టేనా? చేతిలో చెయ్యి వేసి చెప్పండి,.

'నిజమే సరోజా! నాకంత నిన్ను పొగడవలసినంత అగత్యం ఏమివచ్చింది, నాదగ్గరికి వచ్చిన వాళ్లందరు ఇదే మాట అన్నారు!'

పార్థసారథి సరోజ చేతిలో చెయ్యివేసి మరింతగా నమ్మకం కలిగించాడు. ఆమె ఇనుమడించిన సంతృప్తితో ఉల్లాసంతో అతని చెయ్యి గట్టిగా అదిమి పట్టుకుంది. అంతలోనే పార్థసారథి మళ్లీ అందుకున్నాడు.

'నీ తరవాత ఒక్క రాఘవకే ఎక్కువగా మాట దక్కిందని అనుకుంటున్నాను. అంతే!'

'ఏమో నామట్టుకి నాకు అంతగా నచ్చలేదు! ఆయన కన్న మీరేరక్తి కట్టించారు.'

'ఎందుచేత? ఎందుకలాగ అతనిని తీసిపారేస్తున్నావు!.

'మధ్యమధ్యన ఆయన కంఠం జారిపోయింది పాట వెలితిగా వినబడింది.'

'అలాగా నేనది గమనించనేలేదు సుమా!,

రాఘవయెడల ఆమె క్రొత్తవైఖరి పార్థసారథికెంతో ఆశ్చర్యం కలిగించింది. పైగా ఆపొగడ్తతో అతని హృదయంలో వినూతనోల్లాసం వెల్లివిరిసింది. ఆ తరవాత మాటల సందర్భంలో వారిద్దరు ఇంద్రవేషం వేసిన వెంకయ్య 'నారదా' అనబోయి, నాదరా అన్నసంగతితిరిగితిరిగి జ్ఞాపకంచేసుకుని విరగబడినవ్వుకున్నారు అది తలుచుకున్నకొద్ది ఎంతగాప్రయత్నించినా సరోజకి నవ్వు ఆగలేదు ఆమె మాటి మాటికి అదేపనిగా ఉవ్వెత్తుగా నవ్వింది. ఆ తరవాత మొదటి అంకం అంత బాగారక్తి కట్టకపో దానికి అటువంటివే మరికొన్నిలోపాలు ముఖ్యకారణాలని వారిద్దరు నిశ్చయించుకున్నారు.

బండి రంగనాయకి మేడ గుమ్మంముందు ఆగింది సరోజ మున్ముందుగా దిగి ఒకటి రెండుసారులు గట్టిగాతట్టిన తరువాత రంగనాయకి కళ్లు నులుముకుంటూ లేచివచ్చి తలుపు తీసింది, పార్థసారథి అదే బండిమీద తనఇంటికి బయలు దేరడానికి రవంత ఆత్రపడ్డాడు కాని సరోజ అతని సంకల్పంకొనసాగనివ్వలేదు, గుమ్మలో అడుగుపెడుతూ ఉట్టిపడుతున్న అభిమానంతో లోపలికి రమ్మని ఆహ్వానించింది, 'కాస్త కాఫీపుచ్చుకొని వెళ్లి పోదురుగాని రండి!'

'ఇంతటి అర్ధరాత్రివేళ కాఫీ ఎక్కడినించి వస్తుంది?

ఆమెతో కలసి లోపలికి వెళ్లాలవి ఉబలాట పడినా పార్థసారథి అది ఒక అడ్డంకి అయినట్టు నసిగాడు.

'కాస్త డికాషను ఎక్కువగా వేసి చిక్కగా కాఫీ తయారు చేసి ఉంచమని మా అమ్మతో ఇంతకు ముందే చెప్పాను.'

పార్థసారథి మరికాదనలేక పోయాడు. సరోజ అతనిని తిన్నగా మేడమీదికి తీసుకువెళ్లి తనగదిలో సోఫామీద కూర్చోబెట్టి కాఫీతేవడం కోసం లోపలికి వెళ్లింది. అంతలోనే తనకెదురు పడిన తల్లితో ఆ నాటినాటకం సంగతి సంగ్రహంగా ప్రస్తావించింది.

అమ్మా! ఈ వేళ నాటకం ఎంత బాగా వచ్చిందనుకున్నావు! ఊరు, వాడ అందరు చాలా గొప్పగా ఉందని మెచ్చుకున్నారు. అందులోను మన పార్థసారథిగారి కృష్ణవేషం మరీ బాగుంది!'

'అలాగా నేనుకూడా వద్దామనుకున్నాను గాని ఇంటిదగ్గర ఎవరోఒకరు ఉండకపోతే ఎలాగని సందేహించాను'

'పోనీలే! ఈసారి మళ్లీ నాటకం వేసినప్పుడు వద్దువుగాని!'

పార్థసారథి, సరోజ తల్లితో అంటున్నమాటలు ఎంతోజాగ్రత్తగా చెవులురెండు రిక్కించివిన్నాడు ఆమె ప్రశంస అక్షరాల యధార్థమేఅని అతని కప్పటికి గట్టినమ్మకం కలిగింది.

రెండు పింగాణీకప్పు లుంచిన వెండి పళ్ళెంతో సరోజ అక్కడికివచ్చి అదిపక్కనే బల్లమీద పెట్టింది. ఒక కప్పు ఉరకలు వేస్తున్న ఆర్ద్రదృష్టితో అతనిచేతికందించింది పార్థసారథి సరోజ కనుగొలుకులలో తన యెడల తాండవిస్తున్న ప్రగాఢాత్మీయతతోబాటు రెండు మూడుగుక్కల కాఫీగుటుకు గుటుకున తాగి ఆ కప్పు బల్లమీద పెట్టి ఏకాగ్ర దృష్టితో నెమ్మదిగా బ్రతిమాలుకున్నాడు.

'సరోజ! ఈవేళ నువ్వు 'ఇక నీ గిచినగీటుదాట' నన్న పద్యం ఎంతోగొప్పగా చదివావు తెలుసునా! మళ్లీ, ఒక్కసారి అది చదవవూ! వినాలనివుంది!'

'సరిపోయింది! ఇంతటి అపరాత్రివేళ ఇప్పుడు పద్యం చదవడమేమిటి?...ఏదో సామ్యంచెప్పినట్టుంది!'

మరేం భయంలేదులే! ఒక్కసారి చదువు! వినివెళ్లిపోతాను! పోనీ నెమ్మదిగా చదువు!

'ఏమోబాబు! మీరు నవ్వుతారేమో!'

ఆమె చిరుసిగ్గుతో రవంత తలవంచుకుంది బాగా ఎర్రబడిన సరోజ చెక్కిళ్లపై పార్థసారథి చూపు చిక్కుపడి నిశ్చలమై నిలిచింది.

'నవ్వనులే! సొగసుగా పద్యం చదువుతూంటే నవ్వేటంత మొరటు వాణ్ణికానులే!'

'మరి స్టేజిమీద వచ్చినంత బాగారాదేమో! నేను చదవను బాబు!'

సరోజ మరింతగా గునిసింది!

'ఎందుకు రాదు ఇదే స్టేజి అనుకో! నేనుకూడా అచ్చంలా నాటకంలో లాగే లేచి నిలుచుంటానులే!

పార్థసారథి వెంటనే లేచి నిలబడి ఆ ఘట్టంలో సరీగా కృష్ణవేషంతో ఉన్నట్టే ముఖంపెట్టి ఆమె పెదవుల కదలిక కోసం క్షణమొక యుగంగా నిరీక్షించాడు. సరోజ కదలక పోవడం గమనించి తిరిగి ఎంతో ఆప్యాయంగా ప్రాధేయపడ్డాడు.

'లేమరి! ఒక్కసారి! అనవసరంగా బెట్టుసరిచేస్తున్నావు గాని ఈ పాటికి పద్యంఅంతాపూర్తిఅయి ఉండేది! ఒక్కసారి చదువు! మరినేను వెళ్లాలి! ఒక్కసారి!

సరోజ కాదనలేక లేచి నిలబడింది గొంతు కొంచెం తగ్గించినా ఆ పద్యం అంతా రంగ స్థలంమీద ఉన్నట్లే శ్రావ్యంగా చదువుతూ నటించింది తిరిగి సోఫాలోకూర్చోబోయే తరుణంలో అకస్మాత్తుగా పార్థసారథి ఆమెను బిగికౌగిట బంధించి చెక్కిలి ముద్దు పెట్టుకుని నెమ్మదిగా చెవిలో 'వన్స్‌మోర్' అన్నాడు సరోజ కలకల నవ్వుతున్న కళ్లతో అతనిని మరింతగా గాఢంగా కౌగలించుకుని 'ఇక నీ గిచిన గీటుదాట' నన్నంతవరకు మంద్ర మధుర స్వరంతో చదివి మరి నోట మాట వెలువడక నిలువునా కరిగిపోయింది.

( సశేషం )

సీరియల్

# పంచతంత్రము

## వణిక్పుత్రుని కథ

ఒకానొకనగరమునందు సాగరదత్తుడు అను వణిజుడు ఉండెను అతనికొడుకు నూరురూప్యములకు ఒక పుస్తకమును కొనెను దానియందు ఈక్రిందిపద్యము వ్రాయ బడి ఉండెను

"ప్రాప్తవ్యమర్థం లభతే మనుష్యః
దేవోఽపి తం లంఘయితుం న శక్తః।
తస్మాన్న శోచామి న విస్మయో మే
యదస్మదీయం న హి తత్ పరేషామ్॥"

అనగా, "మానవుడు తాను అవశ్యముగా పొంద వలసినవస్తువును పొందును. దానిని దైవముకూడ ఆప లేడు అందుచేలన నాకు దుఃఖముగాని, ఆశ్చర్యముగాని లేదు మనవస్తువు ఇతరులది ఎప్పుడును కాదు" అని అర్థము

అదిచూచి, సాగరదత్తుడు కొడుకుతో ఈ పుస్తకమును ఎంతకు కొంటివి? అనెను "నూరు రూపాయలకు" అని అత డనెను.

మూర్ఖుడా! ఒక్క శ్లోకము మాత్రమే ఉన్న ఈ పుస్తకమునకు ఇంత వెల ఇచ్చితివి. నీవు ద్రవ్యోపార్జనము ఎట్లు చేసెదవు. కనుక నేటి నుండి నా యింటికి రాకుము, అని కొడుకును ఇంటి నుండి వెడలగొట్టెను.

ఆ వణిక్పుత్రుడు దుఃఖముతో దేశాంతరమునకు పోయి ఒకపట్టణములో ఉండెను కొన్నాళ్ళకు ఆ నగర వాసు డొకడు "నీ వెక్కడినుండి వచ్చితివి ? నీ పేరేమి?" అని ఇతనిని అడిగెను" "ప్రాప్తవ్యమర్థం లభతే మనుష్యః" (మానవుడు తన భాగ్యములోనున్న ధనమును పొందును.) అని అనెను ఆయూరివా రెవ రడిగినను అత డిట్లే బదులు చెప్పుచు వచ్చెను కనుక ఆ యూరిలో ఇతనికి "ప్రాప్తవ్యమర్థుడు" అను పేరు వచ్చెను.

ఒకఉత్సవదినమున 'చంద్రవతి' అనురాజకన్యక తన చెలికత్తెలతో నగరము చూచుచు అందగాడైన ఒక రాజపుత్రుని చూచి మోహించి తనసఖితో "సఖీ! ఇతనితో నాకు నేడు సమాగమమునకు ప్రయత్నించుము" అని చెప్పెను. ఆ మాట విని సఖి వెంటనే అతనికడకు పోయి, "నిన్ను చూచినప్పటినుండి మన్మథుడు తనను బాధించు చున్నా డనియు, తనకడకు వెంటనే నీవు రాకున్నచో తనకు మరణమే శరణము" అనియు నాసఖి చంద్రవతి నీకు చెప్పమనెను ఆ మాటకు ఆ రాజపుత్రుడు, "నేను అక్కడికి వచ్చుటకు ఉపాయ మేమి అని అడిగెను." నీవు రాత్రి మేడకు వ్రేలాడ కట్టబడి యున్నత్రాడు ప్రాకి ఆమేడలో ప్రవేశించ వలెను. అని సఖి చెప్పెను. "సరియే" అని అతడు చెప్పెను అది విని సఖి చంద్రవతికడకు పోయి ఆ సంగతి తెలిపెను.

ఆ రాత్రి రాజపుత్రుడు "ఆహా ఇది చాలా చెడుకార్యము. గురుపుత్రితో, మిత్రునిభార్యతో, ప్రభువుభార్యతో, సేవకుని భార్యతోను సంగమము చేసిన వానికి బ్రహ్మహత్యాదోషము సంభవించును ఇది గాక అకీర్తి, నరకము, స్వర్గమునుండి పతనము కలిగించుపనిని ఎప్పుడు గూడ చేయ గూడదు." అని బాగుగా విచారించి రాజపుత్రికడకు పోలేదు.

ఆ రాత్రి "ప్రాప్తవ్యమర్థుడు" నగరములో తిరుగుచు రాజసౌధముకడకు పోయి అక్కడ వ్రేలాడు చున్న త్రాటిని చూచి ఔత్సుక్యముతో దానిని పట్టుకొని పైకి ప్రాకి పోయెను. అతనిని చూచి రాజపుత్రి 'తన ప్రియుడే' యనుకొని సంతోషముతో అతనికి స్నానభోజనాదులు చేయించి సుఖశయనమునం దున్న ప్పుడు 'నిన్ను చూచినప్పటినుండి నీయందు మోహపడి యున్నాను. నిన్నుతప్ప ఇతరుని భర్తగా కోరను. నాతో ఎందుకు మాట్లాడుట లేదు ?" అని అడిగెను. అతడు "ప్రాప్తవ్యమర్థం లభతే మనుష్యః' అని బదులు పలికెను ఆమాట విని రాజ పుత్రి "ఇతడు అన్యుడు. నాప్రియుడు కాడు" అని నిశ్చయించి అతనిని సౌధమునుండి దింపి పంపెను.

తరువాత నతడొకజీర్ణ దేవాలయములోకి పోయి శయనించెను. అచ్చటికి ఒకకులట యిచ్చినసంకేతముపైన ఒకరక్షకభటుడు చేతిలో దండపాశమును ధరించి వచ్చెను. అతడు 'ప్రాప్తవ్యమర్థుని' చూచెను. తన రహస్యము బయట పడు నని, 'నీ వెవడవు?' అని అతనిని ప్రశ్నించెను. అతడు, 'ప్రాప్తవ్యమర్థం లభతే మనుష్యః' అని బదులు చెప్పెను. ఆమాట విని రక్షకభటుడు, ఇది శూన్యదేవాలయము, ఈసమీపము ననే యున్న నా నివాసమునకుపోయి శయనించుము అని చెప్పెను ఆ మాటపని 'ప్రాప్తవ్యమర్థుడు' బుద్ధి దోషముచేత అక్కడనే యున్న మరియొక శయనముపైకి పోయి పండుకొనెను. అక్కడ ఆ రక్షకభటుని కూతురు 'వినయవతి' యనునామె యొక



పురుషునియందు అనురక్తురాలై అతనికి యీసంకేతస్థానమును తెలిపి ఆ శయనముపైన పండుకొని యుండెను. ఆమె యితడు రాగానే, 'ఇతడే తనప్రియు 'డని తలచి అతనికి తాను తెచ్చిన ఆహారమును పెట్టి పాణిగ్రహణము చేసెను. 'ఇప్పటికిగూడ నీవు నాతో స్వేచ్ఛగా మాట్లాడవా ?' అని అతని నడిగెను. అతడు 'ప్రాప్తవ్యమర్థం లభతే మనుష్యః' అని బదులు చెప్పెను. అది విని ఆమె 'యోచించక తొందరపాటుతో చేసిన పనికి ఇట్టి ఫలమే లభించునుగదా !' యని దుఃఖించి యతనిని బయటకు పంపెను. అతడు వీధిలో పోవుచుండగా 'వరకీర్తి' యను నొకవరుడు వివాహార్థమై ఊరేగింపుతో పోవు చుండెను. ఆ పెండ్లి వారిలో చేరి 'ప్రాప్తవ్యమర్థుడు' పోవు చుండెను. ఇంతలో నొక మదపుటేనుగు మావటివానిని చంపి జనమును చిందరవందరగా హతమార్చుచు ఆ పెండ్లివారియింటి వైపునకే వచ్చెను. దానిని చూచి అందరు భయపడి పరుగెత్తి పోయిరి. పెండ్లికూతురు మాత్ర మొక్కతెయే భయపడుచు నిలిచి యుండెను. ఆమెను చూచి 'ప్రాప్తవ్యమర్థుడు' 'భయపడకుము. నిన్ను నేను రక్షించెదను.' అని చెప్పి ఆమెను తన కుడిచేతితో పట్టుకొని ధైర్యముతో పెద్దగా అరచి ఆమదగజమును బెదరించెను. దైవ వశాత్తు ఆగజము తొలగి పోయెను. తరువాత 'వరకీర్తి' మిత్రులు, బంధువులతో పెండ్లికి వచ్చి ఆమెను అన్యపురుషుడు చేపట్టి యుండుటను చూచెను. ఆమెతండ్రితో 'మామగారూ ? నా కిచ్చిన కన్యను మరియొకనికి ఇచ్చి, తప్పు పని చేసితిరి అని యనెను. అది విని ఆయన నేను గూడ ఏనుగుభయముచేత మీ యందరితోపాటే పరుగెత్తి పోయి ఇప్పుడే వచ్చితిని. ఈ జరిగిన సంగతి నాకు తెలియదు.' అని యనెను. పుత్రిని 'అమ్మా ! ఇట్లేల అకార్యము చేసితివి' అని మందలించెను. ఆమె 'తండ్రీ! ఇతడు గజమునుండి నాప్రాణరక్షణ చేసెను. కనుక ఇతనిని తప్ప నాపాణిని గ్రహించుటకు అన్యుని నాప్రాణము లుండు వరకు అంగీకరించను'. అని చెప్పెను. ఇంతలో తెల్లవారెను.

ఆ సంగతి విని జనము మూగిరి. రాజకన్యక, రక్షకభటుని కూతురు గూడ అక్కడికి వచ్చిరి. రాజువచ్చెను. 'ఓయీ ! యీ సంగతి యేమి ? చెప్పుము' అని అడిగెను. 'ప్రాప్తవ్యమర్థం లభతే మనుష్యః' అని అతడు బదులు చెప్పెను. రాజకన్య అందు కొని 'దేవోపి తం లంఘయతుం నశక్తః' అని యనెను. రక్షకభటునికూతురు 'తస్మాన్న శోచామి న విస్మయో మే' అని తరువాతిశ్లోకపాదమును పలికెను. అది యంతయు వినుచున్న క్రొత్తపెండ్లికూతు రగువణిజునిపుత్రి 'యదస్మదీయం న హి తత్ పరేషాం' అని చివరిపాదమును చెప్పెను.

రాజు 'ప్రాప్తవ్యమర్థునకు' అభయ మిచ్చి తన కూతు నిచ్చి వివాహము చేసెను. వేయిగ్రామములు కట్న మిచ్చెను కూతుకు అనేకస్వర్ణరత్నాభరణము లిచ్చెను. అతనినే పుత్రునిగా భావించి యువరాజును చేసెను. రక్షకభటుడు గూడ తన శక్తిమేరకు అతనిని సత్కరించి కూతు నిచ్చి పెండ్లి చేసెను.

తరువాత ప్రాప్తవ్యమర్థుడు తన తల్లిదండ్రులను పిలిపించుకొని వారితో సుఖము, రాజభోగములను అనుభవించుచు నుండెను. ఈ కథ చెప్పి హిరణ్యకుడు 'మిత్రులారా! ఆ కారణము చేతనే "ప్రాప్తవ్యమర్థం లభతే మనుష్యః" అని చెప్పితిని' అనెను.

"ఈ విధముగా అనేక సుఖదుఃఖములను అనుభవించి దుఃఖముచేత ఇప్పుడు నేను మిత్రు డగుఈలఘుపతనకునితో నీకడకు చేరితిని. ఇదియే నావిరక్తికి కారణము అని హిరణ్యకుడు చెప్పెను మంథరకుడు, "భద్రుడా ! లఘుపతనకుడు ఆకలి గొనికూడ, నీవు సులభముగా దొరకిన ఆహారముగా నుండికూడ నిన్ను తనవీపుపైన ఎక్కించుకొని, మార్గమధ్యములోగూడ నిన్ను తినకుండ ఇక్కడికి తెచ్చెను. దీనివలననే నీహృదయ మెంత మంచిదో స్పష్టముగా తెలియు చున్నది. నీవు మంచివాడ వనుటలో సంశయమే లేదు. కనుక నీకు సుస్వాగతము. ఈకొలనితీరము నందు నీవు స్వగృహమునందువలె నివసించుము. విత్తనాశము, విదేశవాసము కలిగె నని పరితపించకుము. వివేకవంతులు ధనాశ పెట్టుకొనరు, ధనహీనుడైనప్పటికిని ప్రజ్ఞావంతుడు విదేశములో బాధపడడు కనుక విదేశవాసమునకుగూడ ప్రాజ్ఞుడ వగు నీవు చింతించకుము. లభించినధనముగూడ కర్మవశముచేత నశించును. ఇన్నాళ్ళుగా నీవద్ద ధన ముండెను. నీది కానిదానిని నీ వొకక్షణ మైనను అనుభవించ జాలవు. అది స్వయముగా నీకడకు వచ్చినను దైవ మపహరించుకొని పోవును. పురుషుడు ధనసంపాదన చేసికూడ మూర్ఖుడైన సోమిలకునివలె దానిని అనుభవించక అడవిని చేరును. 'ఆకథ యెట్లు ? చెప్పు' మని హిరణ్యకు డడిగెను. మంథరకు డిట్లు చెప్పదొడగెను.:-

(సశేషము)

PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION AND PUBLIC RELATIONS, ANDHRA PRADESH, HYDERABAD
PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVERNMENT OF ANDHRA PRADESH, AT THE GOVERNMENT CENTRAL PRESS- HYDERABAD-24

